# ముక్తలక్షణ కౌముది

[బాలవ్యాకరణ పూరణ గ్రంథము]

కృతిభర్త :

శ్రీ వజ్ఝల చినసీతారామస్వామి శాస్త్రిగారు

(జననము ; 25-6-1878; శివైక్యము; 29-5-1964)

వ్యాకర్త :

వంతరాం రామకృష్ణారావు

ఆంధ్రభాషా శాఖాధ్యక్షులు

ప్రభుత్వ కళాశాల

# విజ్ఞప్తి

ఈ ముక్తలక్షణ కౌముదిని ప్రాచ్యకళాశాలా విద్యార్థులకుఁ బఠనీయముగా నిర్ణయించిన గుణగ్రహణపారీణులు భాషాశ్రేయోభిలాషులునగు శ్రీ ఉస్మానియా వేంకటేశ్వర విశ్వవిద్యాలయ పాఠ్యగ్రంథ నిర్ణాయక సభ్యులకుఁ గృతజ్ఞతాపూర్వక నమోవాకములర్పించుచున్నాను తక్కిన విశ్వవిద్యాలయ పాఠ్యగ్రంథ నిర్ణాయక సభల ప్రోత్సాహమును ద్వరలో లభింపఁగలదని యాశింపచున్నాను. యమ్. ఏ. విద్యార్థులకు సహితము దీనిని పాఠ్యముగా నిర్ణయింపవలసిన యావశ్యకత కలదని వినయపూర్వకముగా విన్నవించుచున్నాను.

ఈ ద్వితీయ ముద్రణమున నావశ్యకమని తోఁచిన కొన్ని చేర్పులు మార్పులు చేయఁబడినవి.

— గ్రంథకర్త

# అభిప్రాయములు

"మీరాంధ్ర లక్ష్యలక్షణ గ్రంథములయందు గొప్పపాండిత్యము గలవారు. [31-3-58 నా రచించిన గ్రంథములను బాగుగాఁ జదివి వానిలోనున్న విషయములకు విరుద్ధములగు ప్రయోగముల నెన్నిటినో చూచిరి. వాని సమాధానములను మంచి హృదయముతో గ్రహించిరి." [11-2-59]

— శ్రీ వజ్ఝల చినసీతారామస్వామి శాస్త్రిగారు

"ఈనాటి విమర్శకులలో మీవలె వ్యాకరణమును క్షుణ్ణముగా చదివిన వారరుదు. శ్రీ వజ్ఝలవారి తరువాత గణింపదగిన వారును, వారి స్థానము నలంకరింపదగినవారును మీరేనని నా యభిప్రాయము." [25-12-64] అంత శ్రద్ధతో అంత నిశిత పరిశీలనముతో ప్రాచీన కావ్యములను ఒరసి చూచిన వారు నాకు ఇంకొకరు లేరనియే తోచినది. ఇది ముఖస్తుతికాదు. నిజమైనమాట" [7-10-69]

— శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు

"ప్రతిభ, స్వోపజ్ఞలక్షణము గలది మీ బుద్ధివిశేషము." [29-11-61]

— శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు

అంకితము :

సీ॥ శబ్దశాసనముఖ్యశాస్త్ర కృద్గ్రంథ స
ర్వస్వ సంశోధన పారదృశ్వ
ప్రథిత ఘంటాపథ వ్యాఖ్యాన సంతృప్త
సర్వ విచక్షణ సంచయుండు
పూర్వ కవీశ్వరాపూర్వప్రయోగ వృ
త్యాయతన జిహ్వాశాంచలుండు
సకల వివాదాంశ సమ్యక్పరిష్క్రియా
పటుతరోపజ్ఞా విభాసితుండు

గీ॥ నను సుతికి హేతుభూతంబు యత్ప్రభావ
మట్టి యాశీస్సు విడిన మిమ్మాత్మయందు
మఱవనేర్తునె? జన్మజన్మములకైన
సరస గుణగణ్య! వజ్ఝల గురువరేణ్య!

గీ॥ ఒకనికిని బ్రజ్ఞ యన్నింటనుండవచ్చు
సందు నొకటి లోకోత్తరమై పొసంగు
దాని గుర్తించి కృషిచేయఁ దగునటంచుఁ
గఱపి నన్నుద్ధరించిన గురులు మీరు.

మ॥ పదునాఱేఁడుల పోఱకాఁడనక యాప్యాయంబుగాఁగన్ బదిం
బదిగాఁ బ్రక్కను గూరుచుండుఁడన నే వద్దన్న, మంచంబుఁదా
ము దిగంబోయినఁ, గూరుచుందును దిగంబోకుండనన్ నవ్వి, యొ
ప్పుదలంజూపిన సన్నివేశమది యెప్దుం బాయటీగుండియన్.

క॥ తగమిము నెఱిఁగిన ధన్యుం
డగు నెఱుఁగండే నధన్యుఁడగు నన్న నిఁకన్
బొగడిత లేటికి వృథగా
జగమెఱిఁగిన బ్రాహ్మణునకు జందెంబేలా?

గీ॥ అపర వజ్ఝలశాస్త్రిగా నపర మల్లి
నాథ సూరిగ నపర చిన్నయ్యసూరి
గాఁగఁ గనఁగోరు గురుఋణం బీఁగుపొంచె
నంకిత మొనర్తుఁ గౌముది నందికొనుఁడు.

# ఉదాహృతగ్రంథ సంకేత వివరణ పట్టిక

| | |
|---|---|
| అచ్చ రా | అచ్చతెనుఁగు రామాయణము |
| అనుభవ | అనుభవసారము |
| అప్పక | అప్పకవీయము |
| అభి చిం | అభిధాన చింతామణి |
| అమర. | అమరకోశము |
| అశ్వ. | అశ్వమేధపర్వము |
| అష్టా. | అష్టాధ్యాయి |
| అహో. | అహోబలపండితీయము (ఆంధ్రరచయితల సంఘము) |
| ఆం చిం | ఆంధ్రశబ్దచింతామణి |
| ఆం. నా. స | ఆంధ్రనామసంగ్రహము |
| ఆం. భా. | ఆంధ్రభాషార్ణవము |
| ఆం. భూ. | ఆంధ్రభాషాభూషణము |
| ఆది. [సంశో] | ఆదిపర్వము [సంశోధితముద్రణము] |
| అను. | అనుశాసనికపర్వము |
| ఆముక్త (సంజీ) | ఆముక్తమాల్యద (సంజీవనీవ్యాఖ్య) |
| ఆరణ్య. | ఆరణ్యపర్వము |
| ఆశ్రమ. | ఆశ్రమవాసపర్వము |
| ఇందుమ. | ఇందుమతీపరిణయము |
| ఉ. నా. | ఉత్తరనారసింహపురాణము |
| ఉద్భటా | ఉద్భటారాధ్యచరిత్ర |
| ఉ. రా. | ఉత్తరరామాయణము |
| ఉ. హ. | ఉత్తరహరివంశము |
| ఉద్యో. | ఉద్యోగపర్వము |
| కవిక. | కవికర్ణరసాయనము |
| కవిచిం. | కవిచింతామణి |
| కవిజ. | కవిజనాశ్రయము |
| కవిజనో | కవిజనోజ్జీవని |

| | |
|---|---|
| కవివం | కవిసంశయవిచ్ఛేదము |
| క.ష. | కవులషష్ఠము |
| కళా | కళాపూర్ణోదయము |
| కాల | కాలహస్తిమాహాత్మ్యము |
| కాళిందీ. | కాళిందీకన్యాపరిణయము |
| కావ్యాలం. | కావ్యాలంకారచూడామణి |
| కాశీ | కాశీఖండము |
| కా సూ | కావ్యాలంకారసూత్రవృత్తి |
| కుక్కుటే. | కుక్కుటేశ్వరశతకము |
| కు. సం. | కుమారసంభవము |
| కృష్ణరా. | కృష్ణరాయవిజయము |
| కేయూర. | కేయూరబాహుచరిత్ర |
| క్రీడా. | క్రీడాభిరామము |
| గాథా. | గాథాసప్తశతి |
| గాధే | గాధేయోపాఖ్యానము |
| ఘటికా. | ఘటికాచలమాహాత్మ్యము |
| చమత్కా. | చమత్కారరామాయణము |
| చి.ని. | చిన్నయసూరినిఘంటువు |
| ఛందో | ఛందోదర్పణము |
| జై. భా. | జైమినిభారతము |
| తూ. దో. | శ్రీ తూమాటి దోనప్పగారి వ్యాసములు |
| తెనాలి - చాటువు | తెనాలిరామకృష్ణునిచాటువు |
| త్రి. ప్రా. | త్రివిక్రమప్రాకృతశబ్దానుశాసనము |
| దశ. | దశకుమారచరిత్ర |
| దశా. | దశావతారచరిత్ర |
| ద్రోణ. | ద్రోణపర్వము |
| ద్వా. | సింహాసనద్వాత్రింశిక |
| ద్విరే. | ద్విరేఫవర్ణదర్పణము |
| నరస. | నరసభూపాలీయము |

| | |
|---|---|
| నిరం. | నిరంకుశోపాఖ్యానము |
| నిర్వ. | నిర్వచనోత్తరరామాయణము |
| నీలా. | నీలాసుందరీపరిణయము |
| నృసింహ. | నృసింహపురాణము |
| పద్య.బసవ. | పద్యబసవపురాణము |
| పరమ | పరమయోగివిలాసము |
| పండితా. | పండితారాధ్యచరిత్ర |
| పాండు. | పాండురంగమాహాత్మ్యము |
| పారిజా. | పారిజాతాపహరణము |
| ప్రబంధ | ప్రబంధరాజవేంకటేశ్వరవిజయవిలాసము |
| ప్రబోధ | ప్రబోధచంద్రోదయము |
| ప్రభావ | ప్రభావతీ ప్రద్యుమ్నము |
| ప్రభులిం | ప్రభులింగలీలలు |
| ప్రౌ. | ప్రౌఢవ్యాకరణము |
| బసవ | బసవపురాణము [వావిళ్ళ ప్రతి] |
| బా | బాలవ్యాకరణము |
| బాలస. | బాలసరస్వతీయము |
| బైచ.పంచ. (వేం.పంచ.) | పంచతంత్రము. (బైచరాజువేంకటపతి) |
| భాగ. | భాగవతము. (అకాడమి) |
| భాను. | భానుమతీపరిణయము |
| భా.రా. | భాస్కరరామాయణము |
| భీమ. | భీమఖండము |
| భీష్మ. | భీష్మపర్వము |
| భోజ. | భోజరాజీయము |
| మను. | మనుచరిత్ర |
| మార్కం. | మార్కండేయపురాణము |
| ముగ్ధ (శ్రీరామ) | ముగ్ధబోధవ్యాకరణము (శ్రీరామతర్కవాగీశుని |
| మౌసల. | మౌసలపర్వము |
| య. | యయాతిచరిత్ర |

| | |
|---|---|
| రంగనా | రంగనాథరామాయణము |
| రాఘవ | రాఘవపాండవీయము |
| రాజని | రాజనిఘంటువు |
| రాజశే | రాజశేఖరచరిత్ర |
| రామా. | రామాభ్యుదయము |
| రుక్మాం. | రుక్మాంగదచరిత్ర |
| లంకా. | లంకావిజయము |
| ల.సా.స. | లక్షణసారసంగ్రహము |
| వరాహ. | వరాహపురాణము |
| వసు. | వసుచరిత్ర |
| వికృ | వికృతివివేకము |
| విక్రమా. | విక్రమార్కచరిత్ర |
| విజయ. | విజయవిలాసము |
| విజ్ఞా. | విజ్ఞానేశ్వరీయము |
| విరాట. | విరాటపర్వము |
| వి.పు. | విష్ణుపురాణము |
| వీర | వీరభద్రవిజయము |
| వృషా | వృషాధిపశతకము |
| వైజ | వైజయంతీవిలాసము |
| వై.ని. | వైజయంతీ నిఘంటువు |
| వై.పా. | వైయాకరణ పారిజాతము |
| వ్యా.సం.స. | వ్యాకరణ సంహితాసర్వస్వము |
| శకటరే | శకటరేఫ నిర్ణయము |
| శబ్దక | శబ్దకల్పద్రుమము |
| శబ్దర | శబ్దరత్నావళి |
| శబ్దస్తో | శబ్దస్తోమ మహానిధి |
| శ.ర. (అను) | శబ్దరత్నాకరము (అనుబంధము) |
| శల్య. | శల్యపర్వము |
| శశాంక. | శశాంకవిజయము |

| | |
|---|---|
| శాంతి | శాంతిపర్వము |
| శివత. | శివతత్త్వసారము |
| శివరా. | శివరాత్రిమాహాత్మ్యము |
| శృ నై | శృంగార నైషధము |
| శృ శా | శృంగారశాకుంతలము |
| శృ సం | శృంగారసంకీర్తనలు (తాళ్ళపాక) |
| శేష | శేషధర్మము |
| శ్రీనా.చాటువు | శ్రీనాథుని చాటువు |
| సభా. | సభాపర్వము |
| సమీర. | సమీరకుమారవిజయము |
| సర్వల. | సర్వలక్షణసారసంగ్రహము |
| సర్వ.సం. | సర్వశబ్దసంబోధిని |
| సారంగ. | సారంగధర చరిత్ర |
| సి.కౌ.(బాలమ. | సిద్ధాంతకౌముది (బాలమనోరమావ్యాఖ్య) |
| సుదక్షి. | సుదక్షిణాపరిణయము |
| సూ.ని. | సూర్యరాయాంధ్రనిఘంటువు |
| సోమనా. | సోమనాథ స్తవము |
| సౌప్తిక. | సౌప్తికపర్వము |
| స్త్రీ. | స్త్రీపర్వము |
| హంస. | హంసవింశతి |
| హర. | హరవిలాసము |
| హరిశ్చ. | హరిశ్చంద్రోపాఖ్యానము |
| హ.న. | హరిశ్చంద్రనలోపాఖ్యానము |
| హరిశ్చంద్రో. | హరిశ్చంద్రోపాఖ్యానము (శంకరకవి) |

# ముక్తలక్షణకౌముది

## సంజ్ఞాపరిచ్ఛేదము

**అనుస్వార విసర్గంబులచ్చులని ప్రామాణికులందురు. 1**

హరింవందే, హరిః కరో తీత్యాదులందలి యనుస్వార విసర్గంబులు త్రిపాది గతంబులగు "మోనుస్వారః", (అష్టా 8–3–23) "ఖరవసానయోర్వి సర్జనీయః (అష్టా 8–3–15) అను సూత్రంబుల సిద్ధించుటం జేసి సపాద సప్తాధ్యాయీ గతంబగు "ఇకోయణచి" (అష్టా 6–1–77) యను సూత్రంబుచే యణాదేశ సంధి ప్రసక్తంబు గాదయ్యెనను నాద్య వ్యాకరణ పారీణుల యాశయంబిందులకుఁ బ్రమాణం బని యెఱుంగునది.

**ప్లుతంబులు వర్ణయుక్కులుఁ గేచిస్మృతంబుగఁ దెనుంగున గ్రాహ్యంబులగు. 2**

ఇటనుటం జేసి వీనికి వర్ణసమామ్నాయంబునఁ బృథగ్గణనంబు లేదయ్యె.

ఓ విష్ణూ$_3$, ఓ శంభూ$_3$ (భా. తత్వము 35) రాము భార్యఁ జూం, దో$_3$ జనులార! యడ్డుపడరో$_3$ సురలార! (భా. రా. యు 41) అది తేయార్చితాంఘ్రిపద్మా$_3$ యనంగ (అప్పక 3–250)

**అనార్ఛిక వర్ణంబులు ధ్వన్యనుకరణాన్య దేశ్యంబులంగూడి తెలుఁగున వ్యవహరింపబడు. 3**

ధ్వన్యనుకరణంబులకు : ఠఘుఠఘుక్కున (కాశీ 3–196; పాండు 4–21) ధగధగ, భుగభుగ, భగభగ (కళా 31–111) ఖణేల్, ఖణేలున (కాల 4–153) అకర భోరుభోరునన్ (విజయ 1–168) మొ॥ అన్యదేశ్యంబులకు : ఖుసి (హర 1–2) ఖానులు (వసు 1–46) జముఖానము (మను 5–40) పాదుషాహి (నిరం 1–2) మొ॥ లాఁతిచో సహితము కతిపయాచ్ఛిక పదంబులందుఁ గొందొకచో వర్గయుక్కులు గానం బడియెడి. తాశేవం దంష్ట్రిగుణము దాల్చిన భంగిన్ (వరాహ 6–12) కమ్మగ మాటాడు తవర కలకంఠవరా! (విజయ 3–56) తవర తీవితేవలావును ఢాకయు (అప్పక 2–139)

**అప్రధానోచ్చారణంబులకు వర్ణ సమామ్నాయమునఁ బృథగ్గణనంబు లేదు. 4**

ధూఁయ్యో (భీమ 4-143) తాటాకు (శశాంక.... ....) మఱ్ఱాకు (జై. భా. 8-140) వెంకుంగరంబు (హర 7-12) వెల్లేముఁగు (పారిజా 5-18) ఇత్యాదులు.

**సంస్కృత వాక్య గతంబులగు వర్గ పంచమంబులకు భారతేతర కృతులం గొన్ని యెడలఁ బూర్ణబిందువు గానంబడియెడి. 5**

అంత నాత్మగుహాయాం విహితోస్య, జంతో యనెడు సర్వజంతువులందు (సంహితా 94 పు జన్తో = జంతో) త్రియంబక ఇత్యర్థ యనఁగ.... ....గ, జంబులిం సదర (సంహితా 94 పు. త్రియమ్బకః = త్రియంబకః) వింతయే శ్రుతులందు వేదాశ్చకామ, యంతే యనఁగఁ దదశ్నామి యనఁగ (సంహితా 5:8 పు కామయన్తే = కామయంతే) సాయక సంతోషమున్న సలమిలసాపీ (కళా 6-64. సంతః + అసముత్-సంస్కృత పక్షము: సంతోసము + ఉన్న — అచ్చికపక్షము ఇత్యాది యుభయ భాషాకందంబు) సంతోషించి విశ్లేషణుండు విమలస్వాంతం భవంతం దయా, వంతం శాంతమనంత రూపిణ మహం వందే యటంచున్ (ఉ.రా. 6-164: దయావన్తమ్ = దయావంతమ్) జ్ఞాన విద్యాయుత — సకాంచన విభూష, ణాయ (అప్పక 3-93. కాఞ్చన = కాంచన)

**ఎకార విశిష్టంబులు నకార విశిష్టంబులు నయిచజలు గొన్నియెడల ద్వైరూప్యంబు నరయు. 6**

కంచెల (మను 5-53) కంచెం [భాగ 10.ఉ_799] చెరలాడు [భీమ4-140] చర్లాటము [శాంతి 3-245] చెట్టువలు [శృం.నై.8-153] చట్టువలు [పాండు5-249] గొజెంగ భీమ5-124] గొజ్జంగి [విజయ3-111 జే [శేష-శ.ర.] జా [భీమ6-59: వరాహ 1-148 √జయ] ఇత్యాదులు.

**తాలవ్యచజలు వదాదిస్వరంబు గూడుకోఁ దొంటియట్లు బహుళంబుగ నగు. 7**

కంచంత [పాండు3-81] మంచన [క్రీడా54వ] అమ్మాజమ్మ [పాండు1-66]

ఇవి రెండవప్రకార విశిష్ట చజలు తాలవ్యంబులు గావని యెఱుంగునది. చెంగున, పంచెవన్నియ, జెడ, జెలగ, అక్కజెము, అరజెము, కెజ్జెము, గజెము-ఇత్యాది,

**సంస్కృతసమ చజలు తాలవ్యంబులు (దద్భవచజలు దంత్యంబులు నగు. 8**

మంచము, మంచెము (య 5-13; నీలా 3-90 ఉ.హ. 2-17') జగము జెగము (నీలా 1-5,12; య 1-19,33) జలకము- జెలకము. (య. 1-52) పంజరము పంజెరము. (అచ్చ.రా. అరణ్య) పూజ-పూజె (నీలా 1-6) మజ్జనము, మజ్జెనము (ఆం.భా. 2-160) రాజు-రాజె [య. 2-17 ఆం.భా.-బ్రహ్మ. మో॥] ఇత్యాది.

**చకారంబు నొకానొకచో నుభయంబగు. 9**

తీయగ నంచదార నెన తీయఁగఁ జేసి ననున్ ద్వితీయగన్ [విజయ 1-159

పంచదార = ద్రౌపది; పంచెదార = చక్కెర ఇట్లే జకారంబునకు.

**ఇవంతంబులయిన చజలొకానొకచో సమేతర శబ్దంబులందును గానం బడియెడి. 10**

ఒకానొకచో సనఁగా నయికి వక్రతమం బాదేశంబగు చోట నని యర్థము: చైవుల పాకిరి బాయ మగఁడు [ఆం.నా.స. దేవ] చేసముచైది యనఁగఁజెల్లు [కవి సం 2-106] జైనపల్లియ [దశ 5-63] జైనపలె దశ 5-40] జైనకూళ [బసవ 428,446,450ప బహుళగ్రహణముచేనిటనయికి వక్రతమాదేశంబు నిత్యంబు

**నేను తాను లోను పదంబులు కళలు; లఘుప్రోత్వంబులగుచో ద్రుత ప్రకృతికంబులగు. 11**

ఏ, మ విడవడిగియెద [శల్య 2-333] ఇది సంధిగత ప్రాసంబని యప్పకవీయంబు. [అప్పక 3-373] పవన జాకవచమేనువతింతు నిపుడన, సంధిగత ప్రాసనంజ్ఞదనరు. [ల.సా స. 1-65]

నే, కుఁగరంబుత్సుకవృత్తి, (నిర్వ 4-7, ఇది గసడదవాదేశమె కాని సరళాదేశంబు గాదు.) నేను సేయుఁగనొల్ల (ఉ హ. 3-8) పోవ నీక్తై యేనువోయెదనంచు. (బసవ 309 పు) తానుచుక్కనుఁ [విజయ 1-102. తాను + చుక్క + అనున్; తాను + ఉచుక్క + అనున్.] లోనుపఱుచు (విరాట 1-329) లోఁగొను (ఆముక్త 2-30) లోంగొను (కు.సం. 1-4) లోఁబడి [ఉద్భటా 2-14.] అంతలోఁబడక (హ.న. 2-47 అంతలోన్ + పడక; అంత + లోఁబడక)

**ఏనికి వైకల్పికముగా, వి గాగమాదులకుఁ గ్వాచిత్కముగా స్వరలోపం బగు; నగుచో నయ్యవి ద్రుతప్రకృతికంబులగు. 12**

ఎక్కఁదేఁజనుము (శాంతి 3-348) ఎండేదెందము. (మను 2-62) మరుంద్రబనవాస్త్రహతిన్, (కు.సం. 5-133) దక్షున్ననురూపకృత్యములు, (భాగ 3-267) కమ్మందేనె, (శృం.నై 2-99) చక్కఁజాయ. (కాశీ 2-159) అనుమానముదక్కి గుండెలదరఁగఁ జక్కన్. (నిర్వ 6-10) చక్కంగ [కాశీ 2-73]

**శ్లేషాదులందు సఖండ నిర్బిందు మేళనంబు గ్రాహ్యంబు. 13**

ఒప్పెసఁగురూఢాపూర్వ సత్కీర్తితోన్. (రాఘవ 3-15. ఒప్పు + ఎసఁగు + రూఢ; ఒప్పె + సగురు + ఊఢా.) ఏఁగినియమికి. (రాఘవ 1-28. ఏన్ + కినియమికి; ఏగి + నియమికి ఏగు ధాతువు నిర్బిందుకంబు: ప్రీతితోఁదానిప్పు దేతెంచి మేలయ్యె నని వాగనుశాసనుల ప్రయోగంబు-ఆది 8-63) అదరు నలపంది బలువిడినడఁచె నతఁడు, [హ.న. బలువిడిన్ + అడఁచె; బలువిడిన్ + నడచె) మామకాఁగమన వార్త (విజయ. 1-217 మామక + ఆగమన + వార్త; మామ + కాఁగ + మన వార్త.]

**హ్రస్వముమీఁద బహుళంబుగ, దీర్ఘముమీఁదం బ్రాయికంబుగఁ బూర్ణంబునకు ఖండంబగు. 14**

అడంకువ, అడఁకువ; తోఁట. పేఁట; ఏఁడు, కాఁడు. బహుళగ్రహణముచేఁ గొండొకచోఁ బూర్ణమునకు ఖండములేదు. నారింజ, చేమంతి, గురివెంద లోనగునవి. ప్రాయికంబనుటంజేసి కొండొకచో దీర్ఘముమీఁది పూర్ణమునకు ఖండంబు వైకల్పికంబు. ఆంక, ఏంక, తాంకు [కు. సం. 12-68] పాంది

[అప్పక 3-315] పోండి, మూండు [కు. సం. 6-157; బసవ 33పు; కవిజ] పోంకు, సోంకు [కు. సం. 8-89] పీంగు [కు. సం. 1-4] ఇట ఖండబిందు ఘటితంబులు ప్రసిద్ధంబులు. అంక— ఇత్యాది. ప్రేంకణములోనగు వానియందు ఖండములేమి ప్రామాద గ్రహణము చేతనేయని యూహించునది. ప్రేంకణము, కాళాంజి, ఏకాండము- ఇత్యాదులు.

**ఒకానొకచో దీర్ఘము మీఁదను సాధ్యపూర్ణము గానంబడియెడి. 15**

వీండు, వాండు, (కు. సం. 2-84;10-155) లోంగొను [కు. సం1-4] నాందగు, [కు.సం. 5-141] తలపోంత, కోంత, రోంత. [కాళిందీ 2-35]

**శబ్దశాసనాదుల మతంబునఁ గొన్నియెడల యకారము తెనుఁగుమాటలకు మొదటఁ గలదు. 16**

యేయది హృద్య మపూర్వం,బేయది.(అది 1-30 సంశో) యజ్ఞనామాత్యు ననుజన్ముఁ డహిపభూష,ణాంఘ్రి (శృ.శా.1-53) అశియరామావనీశ, దత్త యెడపల్లి [బాలస. 7 ప.] ఈయకారంబున కెకార విశిష్టంబున కుదంతము మీఁదను ద్రుతంబు మీఁదను లోపంబగు: అపూర్వంబేయది; ఇచ్చెనేయది-ఇత్యాది.

**మేట శబ్ద భవంబు మేడ. 17**

"మేటో హర్మ్యంచ మాలికా." వై. వి.

**జీవక శబ్దభవంబు జీవగఱ్ఱ. 18**

ఇయ్యది జీలకఱ్ఱ శబ్దమువంటిదని యెఱుఁగ వలయును.

**కవిల శబ్దంబు ప్రాకృతభవంబు 19**

"పోవః, కపిలః - కవిలో [షి. ప్రా.] = కవిల.

**కారము క్షార శబ్దభవంబు గాదు 20**

"క్షార లవణ వర్జనంచ" యను నాపస్తంబ వాక్యము నందలి క్షార శబ్దము కటుశబ్ద పర్యాయము కాకుండుటంజేసి కారము క్షారశబ్దభవమనుట ప్రామాదికంబని తాత్పర్యము.

కొన్నియెడల సంస్కృతభవంబులకుఁ బ్రాకృతసమభవంబులు రూపాంతరంబులుగఁ గానంబడియెడి. 21

| సంస్కృతము | సంస్కృతభవము |
|---|---|
| ఆశ్చర్యమ్ | అచ్చెరువు (కు.సం. 11-202) |
| కార్యమ్ | కర్జము (ఉద్యో 4-242) |
| ధర్మః | దర్మము (బసవ 527 పు; కుక్కు-శే 32 ప) |
| నిత్యమ్ | నిత్తెము (దశా 10-55) |
| | నిత్యము బసవ (100 పు) |
| భక్తః | బగుతుఁడు (బసవ 124 పు) |
| | బగుతు (పండితా. మహిమ 318 పు) |
| శయ్యా | సజ్జ (శృ. శా. 2-166; సర్వలం; కావ్యాలం; కవిసం) |
| స్వరః | సొరము (క్రీడా 219; 224 ప.) |

| ప్రాకృతము | ప్రాకృతసమము లేదా భవము |
|---|---|
| అచ్చేరం | అచ్చెరువు (ఆది 2-114; విరాట 4-91) |
| కజ్జం | కజ్జము (బసవ 250 పు.) |
| దమ్మో | దమ్మము (బసవ 552 పు; క్రీడా 54 ప) |
| ణిచ్చం, ణిచ్చో | నిచ్చ (లు) శల్య 1-32; పండితా మహిమ 306 పు; విజ్ఞా. వ్యవ 66 ప; వసు 2-61; పారిజా 1-63; పాండు 3-68) |
| బత్తో | బత్తుఁడు (బసవ. 5-32 పు; పాండు 3-78) |

| | |
|---|---|
| సెజ్జా | సెజ్జ (విరాట 2-239] |
| పర | పరము (మను 1-5 య 4-158) |

సంస్కృతభవంబులందుఁ గొండొకచో రూపాంతరంబులు పెక్కులు గానంబడియెడి. 22

ఉజ్జయినీ శబ్దభవంబులు – ఉజ్జేని (దశ3-59 ఉజ్జని) శృ.నై. 5-33; విక్రమా 2-48) కన్యకా శబ్ద భవంబులు – కన్నియ (పారిజా 1-88) కన్నె (విజయ 2-159) కన్య (రాఘవ 1-7) బ్రాహ్మణ శబ్ద భవంబులు-బాహ్మఁడు (కు.సం. 7-28; బసవ 572పు; భాగ 1-62) బమ్మఁడు [వైజ4-33] బాపఁడు (వరాహ 7-73; క్రీడా 62 వ;నీలా 1-192) బాఁడు [క్రీడా 159] బాపనుఁడు (ఆం.భా 2-171) బావన (విక్రమా 4-63) విజ్ఞాన శబ్దభవంబులు— విన్నాణము (ఉ.హ. 1-8; వసు 2-138) విన్నాణువు (శాంతి 1-235) విన్ననువు (శాంతి 4-179) శరణ శబ్ద భవంబులు — సెరణము (భాగ 11-15)సరణము (బసవ. 264పు) శేషా శబ్ద భవంబులు– సేస (బసవ 52పు; ఆది 4-17; భాగ 10-పూ1748) సాస (భాగ. ఉ. 667ప)

కొన్నియెడల సంస్కృత భవంబులకు సంస్కృత సమంబులతో సారూప్యంబు చూపఁబడె. 23

| సంస్కృతసమము | సంస్కృతభవము |
|---|---|
| కన్య [సం.కన్యా] | కన్య (రాఘవ 1-7. √ కన్నియ) |
| కైవారము | కైవారము(య. 1;61; నీలా |
| పండితా 118ప; శృ.నై | 2-42. √ కయివా |
| 7-89: హర. | రము_ఘటికా 270; బసవ 66పు) |
| 6-9; కాశీ 7.57.) | |
| కోమలి | కోమలి (నీలా 2-95.) |
| విరాట1-151; కు.సం 5-102) | తంత్రము(బసవ.405ప. √ తంతరము) |
| తంత్రము [సం.తన్త్రమ్] | నిత్యము (బసవ 100 పు |
| నిత్యము [సం.నిత్యమ్] | √ నిత్తియము) |

| | |
|---|---|
| బిరుదు [తత్సమ 32] | బిరుదు (విరాట 3-30) |
| మంత్రము [సం మంత్రః] | మంత్రము (కు.సం. 6-96: అచ్చ. రా. యు. 549; అముక్త 5-112; బసవ 405. పు॥ మంతరము – బసవ 362పు) |
| రూపు (చూ.తత్సమ 32) | రూపు (య. 1-57;92) |

ఒకానొకచో సంస్కృత ప్రాకృత పదంబుల కేకరూపత గానంబడి యెడి. 24

| సంస్కృతసమము | ప్రాకృతసమము |
|---|---|
| కరణి (కరణిః హమ్మీర 5-1 అముక్త. సంజీ 4-81) | కరణి)య 2-75. ప్రా కరణీ- గాథా 3-100- అముక్త 4-81 సంజీ) |
| నావ (బా. తత్సమ. 63.) | నావ (ఆం.భా. 1-157: కేయూర 3-194; ప్రా. నావా - త్రి. ప్రా. 1-2-104) |

తెనుఁగున సమస్త పదవికృతులు పెక్కు తెలుగులం గానంబడియెడి. 25

| సమస్త పదము | సమస్త పదవికృతి |
|---|---|
| అంతః పురము | అంతిపురము (అరణ్య 2-147; విరాట 1-131) |
| అంతరతామరసము | అంతర దామర (అముక్త 1-71 ఆం.భా: 1-165) |
| అనేకభారముల్ | అనేక బారువుల్ (శృ. నై 7-11) |

| | |
|---|---|
| అమరరామ | అమర లేమ (కు.సం 8-127) |
| అశ్రద్ధ | అసడ్డ (శాంతి 4-426) |
| ఆపోశనము | అపోసనము (శృ.నై. 5-68)<br>అపొసనము (భోజ 6 ఆ) |
| ఉత్తరదోఃకరము | ఉత్తర దొక్కరము (మల్లు - సూ.ని.) |
| ఉపరిగృహము | ఉప్పరిగ (శ. ర.) |
| ఏకసంధ | ఏక సంత (కళా 1-78) |
| కంఠసరము | కంటసరి (పారిజా 4-16) |
| కపటమనుష్యుఁడు | కపట మానిసి (అముక్త 2-269) |
| కరదీపిక | కర దివ్వె (హరిశ్చ) |
| కర్పూర దీపము | కపురదీపము (హర 1-10) |
| కర్పూరవాసన | కపుర వాసన (ఉ.రా. 4- 77) |
| కర్మారి [పండితా 251 పు- సూ. ము.] | కనుమారి [శాంతి 1-307. పండితా; ఉ. హ. 4-56] |
| కాలఘంట | కాలగంట [కలహ 4-97] |
| కేశాకేశి | కేసాకేసి [కు సం. 11-64] |
| క్రౌంచస్వరము | కొంచ సొరము [శ-ర] |
| ఖండశర్కర | కండ చక్కెర [వాల్మీ 2-84] |
| ఖరశాణము | కరసాన [నిర్వ 6-43.] |
| గరుడస్త [క] ంభము | గరుడ కంబము [భాగ 8-536] |
| చతుర్దంతి | చవు [చౌ] దంతి [ఉ.రా. 5-43; అముక్త 4-154; మను 5-59; ఆం.భా; ఆం. వా. స చూ. అహో 523పు] |
| చతుష్పదము | చౌపదము [జై.భా. 5-196] |
| జగజ్జ్యోతి | జగజ్యోతి [అముక్త 4-35] |

| | |
|---|---|
| జైనవల్లిక | జైనవల్లియ [చూ. 13 సూ.] |
| తపో [వ] రాజు | తవరాజు (బసవ 273 పు) |
| దానవరాజు | దానవరాజు [భాగ. ఉ. 374] |
| దీపస్క (స్త) ంభము | దీపకంబము (బసవ 12పు) |
| దీపయష్టి | దివ్విటీ (బసవ 169పు.) |
| దీపికాస్క (స్త) ంభము | దివ్వె కంబము (నీలా 3-90) |
| | దివియ కంబము (భీమ 3-62) |
| దోషకారి | దోసకారి [వసు. 3-47] |
| ద్వీపటి | దుప్పటి (టీ) (నీలా 1-81; ఉ.రా. 6-20) |
| నాగకన్యక | నాగకన్నియ (భాగ. 5 స్కం. 2-124) |
| నాగవేత్రము | నాగ బెత్తము (కళా 2-50) |
| నాగస్వరము | నాగసౌ (స) రము (క్రీడా 219. 224: య. 4-158) |
| నిరాహారి [శృం.సం. 5పు.] | నిరాహారి (నీలా 1-20) |
| నిర్జీవి | నిజ్జీవి (బసవ 163పు) |
| పంచవర్ణిక | పంచ వన్నియ (భీమ 1-111; పండితా. 1 భా. 166పు; శివరా 3-26) |
| పద్మవనము | పద్దవనము (కు. సం. 12-194) |
| పృథివీపుఁడు | పుడమిపుఁడు (కు. సం. 11-44) |
| ప్రాణకుట్టము | ప్రాణ గొడ్డము. (అను 4-134; 320; దశ 3-70; 6-94; కు. సం:4-421.) |
| బ్రహ్మహత్య | బ్రహ్మత్య (పండితా 125 పు) |
| మంగళారాత్రిక | మంగళారతి (బసవ. 65 పు.) |
| మహాజనము | మాజనము (బసవ 7ఆ) |
| ముఖశాల | మొగసాల [కాశీ 4-105] |
| మూలభండారము | మూల బండరువు (పండితా 1 భా-8పు.) |

| | |
|---|---|
| యోగపట్టిక | యోగ పట్టె (పండితా. 2భా-324పు; మను 1-59) |
| యోగపాదుక | యోగవాగ (లు) (పండితా. పర్వత 394పు) |
| రాజభారము | రాయబారము (శృ నై 3·76; కాశీ 6-217; అహో 523పు) |
| వనలక్ష్మి | వన లచ్చి (కు. సం. 5-123) |
| వారాశి | వారాసి (భీమ 1-19) |
| వీరమధ్యము | వీర మద్దియ (ద్దె) ము (ఉ.హ 5-64; యా; 4-89 ప్రభావ 4-138 |
| వీరమర్దల | వీర మద్దెల (కు.సం. 11-51) |
| శరణార్థి | శరణార్తి (బసవ 264పు) |
| శృంగనాదము | సింగి నాదము (కళా 2-50 యా. 3-57) |
| శోధనదీపిక | సోదన దీవె (ఉ.హ. 2-94) |
| సర్వాంగకచ్ఛటము | సర్వాంగకచ్ఛడము (బసవ 143పు) |
| సురపున్నాగము | సురపొన్న (శృ నై.1-95) |
| సూర్యపటము | సూర్య (రె) పుటము (హంస 5-356; ఉ.రా. 6-128) |
| స్క (క) ంభసూత్రము | కంబ సూత్రము (పండితా 2భా — 435పు) |
| స్థానదీపిక | తానదీవియ (కు.సం.8-44) |
| హంసపదము | అంచ పదము (ఆముక్త 5-29) |
| హంసయాన | అంచయాన (రుక్మాం. 4అ.) |
| హోమకుండము | హోమగుండము బాగ (8-536) |

ఇత్యాదులరయునది.

**అహేయంబు లన్యదేశీయంబులు పరిగ్రాహ్యంబులు. 26**

తమిళ పదంబులు: అంగయక్కణ్ణి (కాలహ (3-133;134 పొరి వి శంగాయ (ఆముక్త 2-97) పెణ్ణు మణ్ణు, (కాలహ3-185) కర్ణాట పదంబులు కెడ్పెరను (కు సం. 11-127;194; ద్రోణ 4-294; 5-193; శల్య; 1-104; శృ నై. 6-29; కాశీ 1-93) నాయి (కు. సం. 1-19) బిజమాడు, బిడార (కాలహ 1-35) బేటము (కు.సం. 5-553; పండితా. పురాతన. 144 ప) బేటంబేటము (కు సం 1-176) మొసరు (కు సం. 1-12) ముడి = కిరీటము (కు.సం. 9-213): మరాఠీ పదంబులు: కిచ్చడి (కాశీ 7-185) గంజాయి (శివరా 3-62) చావడి (జై. భా. 8-80; వరాహ 6-90) జము [ముక్త] ఖానము (మను 5-4; ప్రబోధ 4-13) లూటి (వరాహ 3-92) పారసి మరాఠీ సంబంధముగల పదములు; అపివారు (మను 1-11; కాశీ 4-194) ఈనాము (వరాహ 4-159) కమరు (శివరా 2-3,26; కాశీ 3-240) కాకితము (భీమ 1-74) కుందనము. (శృ. నై. 5-188; విక్రమా 4-19; జై. భా 7-74; శృ శా 2-62; వరాహ 11-44 మొ॥) ఖానుఁడు (వసు 1-46) ఖుసి (హర పీఠిక 22) జలపోసనము (పండితా. పర్వత 310; 346 ప; కాశీ 6-161) త్రాసు (6; శాంతి 2-374;4-33; విజ్ఞా. ప్రాయ. 65 ప) బిబ్బి [వసు 1-46;69] మసీదు [క్రీడా 149] సేబాసు [హర. 7-54 విక్రమా 8-66] మలయాపదములు; తటాసీరి: తవాయి, రమణా, చీనీభాషా జన్యము; సమ్మాను [హర 1-28] ఇత్యాదులు. (తూ.దో.)

**ఇది సంజ్ఞా పరిచ్ఛేదము**

# ముక్తలక్షణకౌముది

## సంధిపరిచ్ఛేదము

**సంధిలేనిచోట స్వరంబుకంటెం బరంబయిన యేకస్వరంబునకుం బ్రకృతిభావంబగు. 1**

ఇట సంధ్యభావంబునకు సంహిత లేమిహేతువని యూహించునది.

"ను" .... అనునది ; "ను" అనునది. [బా. క్రియా 16.]

రాముఁడు .... ఉః .... అనె ; రాముఁడు "ఉః" అనె.

సమాన పదంబునందు సంధిలేమి యనుక్తన్యాయ సిద్ధంబని యెఱుంగునది.

రాముఁడు, రాముండు-ఇత్యాది.

**అత్తునకు సంస్కృతీయంబునకుఁ బూర్వకావ్యంబులందునుగొన్ని యెడల సంధిగానంబడియెడి. 2**

పూర్వ కావ్యంబులందనఁగాఁ బదునాఱవ శతాబ్దికిఁ బూర్వకావ్యంబులందని యర్థము.

వార్త .... అని : వార్తని [బసవ 373పు]
ప్రభు .... ఓ : ప్రభో [ఉ.హ. 4-138]
సీమ .... అటు : సీమటు [భీమ 5-76]
మాత .... అట : మాతఁట [జై.భా. 6-115]
సుసరభేత్త .... అని : సుసరభేత్తని [క్రీడా 77ప]

ఇత్యాదులు.

**ఆరగాగమంబుతుదియత్తున కొకానొకచో సంధిమూవట్టెడు. 3**

జైనులార .... ఎన్నఁడు : జైనులారెన్నఁడు [బసవ 435పు]

పాతకులార .... అని : పాతకులారని [ఆముక్త 7-13]

**ఇక్కడాదులకు సప్తమ్యర్థక ప్రథమాంతంబులకు సంధితఱుచుగ నగు. 4**

ఇక్కడ .... అక్కడ : ఇక్కడక్కడ [విరాట 2-134; 250; ఉ.హ 4-216]

తఱుచుగ ననుటంజేసి యొకానొకచోట నామ్రేడితంబు పరంబగునపుడు వైకల్పిక సంధియుంగలదని తాత్పర్యము.

ఎక్కడ .... ఎక్కడ ; ఎక్కడెక్కడ

ఎక్కడయెక్కడ [ఉ.హ 6-250]

షష్ఠీసమాసంబునలట్టునకు సంధివైకల్పికంబుగ నగు. 5

| | | |
|---|---|---|
| రాజులయొక్క .... | ఒద్ద : | రాజులొద్ద [ఆది 8-65] |
| తల్లిదండ్రులయొక్క .... | ఒద్ద : | తల్లిదండ్రులొద్ద [అరణ్య 2-133] |
| గతిహీనులయొక్క .... | ఇండ్లన్ : | గతిహీనులిండ్లన్ [బసవ 2-71పు] |
| పురోహితులయొక్క.... | అనుమతంబునను | పురోహితులనుమతంబునను [బసవ. 236పు] |
| గురువులయొక్క.... | ఇండ్ల : | గురువులిండ్ల [పాండు 4-44] |
| తామరసనేత్రలయొక్క ... | ఇండ్ల : | తామరసనేత్రలిండ్ల. [మను 3-73] |

పక్షంబున, రాజులయొద్ద నిత్యాది.

భారతేతర కావ్యంబులం గొండొకచో నిక్కార్యంబు అడాగమేతరస్థలంబులయందును గానంబడియెడి.

| | | |
|---|---|---|
| వంటయొక్క.... | ఇల్లు : | వంటిల్లు [భీమ 3-51] |
| మేఁకయొక్క.... | ఎరువు ; | మేఁకెరువు [ఆముక్త 4-134] |
| లేనెలయొక్క.... | అంత : | లేనెలంత [విజయ 1-195] |

| | | |
|---|---|---|
| ఈఁబిదయొక్క.... | ఆరు : | ఈఁబిడారు [॥] |

ఆకుశబ్దంబు పరంబగునపుడు సంధిత ఉచుగనగు.

| | | |
|---|---|---|
| తామరయొక్క.... | ఆకు : | తామరాకు |
| చింతయొక్క.... | ఆకు : | చింతాకు [పాండు 5–39] |

తఉచుగననుటంజేసి, తామరయాకు [సుదక్షి 3-164] చింతయాకు (పాండు 4–275) నను రూపంబులు గ్రాహ్యంబులు. తామరపాకు నీటిభంగి [ద్రోణ 4-309] తామరపాకునీరుబలె (ఉ హ 3–35) ననుపాఠంబులు సమ్మతంబేని తామర శబ్దంబునకుఁ గ్లీబసమ రూపాంతరంబు గలదని యూహించునది. చూ. అచ్చిక 1]

కర్మధారయంబునందుఁ గోల వెల్ల శబ్దంబుల యత్తునకు సంధిచూప బ్రైడు. 6

| | | |
|---|---|---|
| కోల .... | ఎమ్ము : | కోలెమ్ము (ఆది 6–214; బసవ. 241పు) |
| వెల్ల .... | ఎల్లి : | వెల్లెల్లి (శృ.నై. 8-201 పండితా. 2భా. 313పు.) |
| వెల్ల .... | ఉల్లి | వెల్లుల్లి (భీమ 4-130) |
| వెల్ల .... | ఏన్గుఁగు : | వెల్లేనుఁగు (పారిజా 5-18) |

భావార్థక టవర్ణకంబు నత్తునకు పంధి వైకల్పికంబుగనగు. 7

| | | |
|---|---|---|
| వేఁడుట .... | ఎంతయు : | వేఁడుటెంతయు. (ఆది 5–217 వేఁడుటయెంతయు. |
| చూచుట .... | ఆయువు : | చూచుటాయువు. (అను 4–90) చూచుటయాయువు, |

ఏలాదుల యత్తునకుఁ గొన్నియెడల సంధి గావంబడియెడి. 8

| | | |
|---|---|---|
| ఏల .... | ఇంత | ఏలింత (ఉద్యో 2–251) |
| ఏల .... | ఉండుదురు : | ఏలుండుదురు. (ద్రోణ 3–29) |

| | | |
|---|---|---|
| ఏల .... | ఉడుగు : | ఏలుడుగు. (కర్ణ 1-,52) |
| ఏల .... | ఉన్నవి : | ఏలున్నవి (ప్రభావ 5-174) |
| బేల .... | ఉబ్బడు : | బేలూబడు (కర్ణ 1-222) |
| కోల .... | ఊడదు : | కోలూడదు (హర. 2-87) |
| ఒక్క .... | ఉమ్మడి । | ఒక్కుమ్మడి. (భీష్మ 2-111) |

ఒకానొకచో నవర్ణకాంతంబు నత్తునకు సంధి చూపట్టెడు. 9

| | | | |
|---|---|---|---|
| వెచ్చన .... | ఓ : | వెచ్చనో | శాంతి 6-216 |
| చల్లన .... | ఓ : | చల్లనో | |

అత్తున కవధారణార్థకంబునకు సంధి లేదు. 10

| | | |
|---|---|---|
| ఇంటికడన .... | ఉన్కి : | ఇంటికడనయున్కి (విరాట 3-157) |
| అగున .... | ఏని : | అగునయేని. (శృనై. 2-171) |

కొన్నియెడల షష్ఠీసమాసంబునం దిత్తునకు సంధి విభాషనగు. 11

| | | |
|---|---|---|
| మగనియొక్క .... | ఆలు : | మగనాలు (కాశీ 2-83) మగనియాలు [హరి. పూ 9-96; ఉ.రా 5-98] |
| వెండియొక్క .... | ఉంగరము : | వెండుంగరము (హర 7-12) వెండియుంగరము. |
| కంచియొక్క .... | అంత : | కంచంత (పాండు 3-81) కంచియంత (ఉద్భటా 2-253) |
| పురుటియొక్క .... | ఆలు : | పురుటాలు (శృ.శా 2-45 62; భాగ 8-516) పురుటియాలు [రామా 6-250] |
| అతనియొక్క .... | ఇంట : | అతనింట (ఆముక్త 1-83) అతనియింట |
| వానియొక్క .... | అరదము : | వానరదము (జై. భా. 7-19) వాని యరదము. |

తాటియొక్క .... ఆకు: తాటాకు (వరాహ 3-55), తాటియాకు

మట్టియొక్క .... ఆకు: మట్టాకు (జై భా 8-146;147) మట్టియాకు

రావియొక్క .... ఆకు: రావాకు (రుక్మాం. 2-113) రావియాకు [రుక్మాం 2-113]

ఒకానొకచో సాంస్కృతికస్వరంబు పరంబగుచో నికార్యంబుచూపఁబడెడు. పుడమియొక్క .... ఈశ: పుడమీశ (బసవ 125 పు)

ఒకానొకచోఁ గర్మధారయంబునం దిత్తునకు సంధి చూపఁబడెడి. 12

నవతి .... అలు: నవతాలు (అను 5-272; కాశీ 4-267)

ముసలి .... అమ్మ: ముసలమ్మ. (హర. 2-90)

గ్రుడ్డి .... అవ్వ: గ్రుడ్డవ్వ. (హర. 2-88)

పచ్చని .... అక్షతలు: పచ్చనక్షతలు (శివరా 4-13)

ఏమ్యాదుల యిత్తునకుఁ గొండొకచో సాంస్కృతిక స్వరంబు పరంబగునపుడును సంధిగానంబడియెడి. 13

అరమానిసి-ఆత్మవిస్తారము; అరమాని సాత్మవిస్తారము (పాండు 1-115)

ఇత్తున కాచ్ఛికంబునకు సంబోధనాంతంబున కొకానొకచో సంధి చూపఁబడెడు. 14

పడఁతర్థ్యపణ్యముల్ పట్టునావుడున (బసవ. 139పు)దీనికిఁ బ్రయోగాంతరంబు మృగ్యంబు.

శ్రేష్ఠతావాచకంబులగు నార్యాద్యర్థకంబులు పరంబులగుచో నాచ్ఛికంబగు నిత్తునకుఁ గొండొకచో సంధి గానంబడదు. 15

చిట్టి .... అన్న: చిట్టియన్న (భోజరా 1-53)

అమ్మాజి.... అమ్మ: అమ్మాజియమ్మ (పాండు 1-67)

కొండొకచోననుటచే చిట్టన (భోజ 1-47) అమ్మాజమ్మ (పాండు 1-66) యనియురూపంబులు.

ఇత్తున కార్యాద్యర్థకంబులు పరంబులగునపుడొకానొకచోఁ బూర్వపర స్వరంబుల కెత్వం బేకాదేశంబగు. 16

| | | |
|---|---|---|
| మంచి.... | అన : | మంచెన (బసవ. 468, 469ప) |
| నంది .... | అన్న: | నందెన్న (బసవ. 375 ప) |
| ఆది .... | అన: | ఆదెన (శృశా. 1-41) |
| పల్లి .... | అమ్మ : | పల్లెమ్మ(క్రీడా 145ప) |

ఒకానొకచో ననుటచే - మంచన (పండితా 1భా-7ప) క్రీడా 145ప) నందన్న, ఆదన, గాది + అన = గాదన (శృ. శా. 1-2) పల్లమ్మ- ఇత్యాదులు గ్రాహ్యంబులు.

ఇత్తునకు సంస్కృతీయంబునకుఁ గొండకచో సంధిగానంబడియెడి. 17

| | | |
|---|---|---|
| భూతి .... | అలదు: | భూతలదు(శివరా. 5-52) |
| ధూళి .... | అయ్యె | ధూళయ్యె (భీమ. 4-143) |
| అర్చి | ఇడఁగ: | అర్చిడఁగ (వసు. 3-180) |
| శౌరి .... | ఇచ్చు: | శౌరిచ్చు (అహో 230ప) |
| మధుమావతి .... | ఓర్గల్లు: | మధుమావతోర్గల్లు (క్రీడా 242) |

మధ్యమపురుష క్రియలయందలి యిత్తునకును గొన్నియెడల సంధి చూపట్టదు. 18

| | | |
|---|---|---|
| ఏగుదెంచితిరి.... | ఇందుకళాధర భృత్యులార: | ఏగుదెంచితిరియిందుకళాధరభృత్యు లార. (శివరా 4-56) |
| పైరింపవైతి .... | ఈశావము నకు: | పైరింపవైతియీశావమునకు (కాశీ 6-23) |
| బేలవైతివి | ఈగుణంబు: | బేలవైతివియీగుణంబు (పాండు 3-36) |

| | | |
|---|---|---|
| చేసితివి .... | ఇంతట: | చేసితివియింతట (వి. పు. 5-83) |
| పట్టితివి .... | ఈయన; | పట్టితివియీయన (రామా 6-235) |
| వచ్చితివి .... | ఈవనవాటిక: | వచ్చితివియీవనవాటిక. (కవిక 3-97) |
| త్రోచితిరి .... | ఎచ్చట: | త్రోచితిరియెచ్చట (క ష- వర్వం 1-19) |

ఉత్తమపురుషైకవచనంబునందలి యిత్తున కొకానొకచో సంధి గానం బడియెడి. 19

| | | |
|---|---|---|
| ఒనరించితిన్ .... | ఈశ | ఒనరించితీశ కాలహ 4-78) |
| కొలిచితవ్ .... | అబ్ధిజన్: | కొలిచితిబ్ధిజన్ (అహో 235పు) |
| చేసితిన్ .... | అచ్యుతా ర్చనము: | చేసితచ్యుతార్చనము (అహో 231పు) |

కొన్నియెడల ద్రుతాంతంబులగు తద్ధర్మాద్యర్థకంబుల యుకారంబునకు సంధి గానంబడియెడి. 20

| | | |
|---|---|---|
| ఇడుదున్ .... | అని: | ఇడుదని [పండితా 70పు] |
| దొరయఁజేయుదున్ .... | ఏన్: | దొరయఁజేయుదేన్ (హ.న. 2-38) |
| ఎఱుఁగుదున్ .... | అఖిలంబు: | ఎఱుఁగుదఖిలంబు (హ.న. 4-60) |
| ఒనర్చుదున్ .... | ఉరుమహిమ: | ఒనర్చుదురుమహిమ (హన. 4-58) |
| కననయ్యెదున్ ... | అనఘ: | కననయ్యెదనఘ (హ.న. 4-58) |
| నగించున్ .... | అటు: | నగించటు (బైచ. పంచ) |

చిట్టడవిఁ జిలుత. 21.

చిట్టడవిఁ జిట్టియనుట యగ్రాహ్యమని తాత్పర్యము.

కడుశబ్దంబు దకారంబునకొకానొకచో సాంస్కృతికస్వరంబు పరంబగునపుడు ద్విరుక్తటకారంబగు. 22

| | | |
|---|---|---|
| కడు .... | ఉగ్రము : | కట్టుగ్రము. [బసవ. 166పు] |
| కడు .... | ఉగ్రలీల : | కట్టుగ్రలీల. [బసవ. 263పు] |

ద్రుతప్రకృతికంబు మీఁది పరుషము కు శ్వాస వర్ణంబు పరంబగుచో సరళాదేశంబు లేదు. 22

| | | |
|---|---|---|
| వచ్చెను .... | క్షత్రియుఁడు : | వచ్చెను క్షత్రియుఁడు |
| తెచ్చెను .... | త్సరువు : | తెచ్చెనుత్సరువు |

యుష్మదస్మదాత్మార్థకంబుల ద్రుతంబు నుడి తొలి హ్రస్వంబు మీఁది బిందులోపంబులు లేవు. 23 నకు హలవ సానంబులు పరంబులగునపుడు

| | | |
|---|---|---|
| విన్ .... | కలిపె: | విన్గలిపె [ఆది 6-45] |
| విన్ .... | కని: | విన్గని [విరాట 2-213] |
| తన్ .... | పంచిన: | తన్పంచిన [ఆది 3-110] |
| తన్ .... | వినుచున్న: | తన్వినుచున్న [ఆది 3-9] |

ఇత్యాదులూహ్యంబులు.

భవద్భావి క్రియాపదంబుల నువర్ణకంబునకు, కృవదర్థకముమీఁది నువర్ణంబునకు హలవసానంబులు పరంబులగునపుడు బిందుసంశ్లేషంబులును ద్రుతంబునకు లోపంబును లేవు. 24

| | | |
|---|---|---|
| చదువుచున్నాను .... | కావ్యము: | చదువుచున్నానుగావ్యము. |
| చదువఁగలను .... | కావ్యము: | చదువఁగలనుగావ్యము. |

| | | |
|---|---|---|
| కావ్యము .... | చదువుచున్నాను: | కావ్యముచదువుచున్నాను. |
| కావ్యము .... | చదువఁగలను: | కావ్యముచదువఁగలను. |
| చదివినాను .... | కావ్యము: | చదివినానుగావ్యము |
| కావ్యము .... | చదివినాను: | కావ్యముచదివినాను. |

లుప్తోత్కంబులగు నేనుతాను పదంబుల ద్రుతంబునకు సంశ్లేషంబును గలదు. 25

| | | |
|---|---|---|
| తాఁ .... | చదివె: | తాఞ్జదివె. |
| తాఁ .... | వినె: | తాన్వినె. |

మకారంబు పరంబగునపుడు నొకానొకచో ద్రుతమునకుఁ బూర్ణబిందువు గానంబడియెడి. 26

ఇట మకారాదేశవిధి లక్ష్యలక్షణవిరుద్ధంబగుటంజేసి యనాదరణీయంబు.

| | | |
|---|---|---|
| లతాంతములకుఁ .... | మొనసి: | లతాంతములకుంమొనసి [ఆది 5–137] |
| చేసెఁ .... | మహానదులఁ: | చేసెంమహానదులఁ. [అరణ్య 3–113] |
| మీఁదఁ .... | మఱియుఁ: | మీఁదంమఱియుఁ. [పాండు5-141] |
| పరాక్రమములఁ .... | మెఱసి: | పరాక్రమములంమెఱసి [రుక్మాం. 5-38] |

ఉదంత స్త్రీసమంబులకు సాంస్కృతిక పరుషంబు పరంబగునపుడును గొండొకచో నుగాగమంబు చూపట్టెడు. 27

| | | |
|---|---|---|
| అనుఁగు .... | క్రీడల: | అనుఁగుంగ్రీడల [వసు 3-32] |
| ముద్దు .... | కీరము: | ముద్దుఁగీరము [విజయ 2–184] |

ఉదంతమగు తద్ధర్మార్థ విశేషణమున కచ్చుపరంబగునపు డొకానొకచో నుగాగమంబు గన్పట్టెడు. 28

| | | |
|---|---|---|
| త్రెంచు .... | ఉగ్రశరము: | త్రెంచుగ్రశరము [జై.భా. 6-186] |
| వచ్చు .... | అమాత్యులు: | వచ్చుమాత్యులు [శృ.శా. 3-226] |
| జాఱు ... | ఒప్పున: | జాఱొప్పున [కాలహ 2-56] |
| చిందు ... | అమృతము: | చిందమృతము [కాలహ 2-134] |

ఉదంత తద్ధర్మార్థవిశేషణమునకు హల్లుపరంబగునపుడును గొండొకచో నుగాగమంబు బహుళంబుగనగు. 29

| | | |
|---|---|---|
| వాలారు ... | కొనగోళ్ల: | వాలారుంగొనగోళ్ల [మను 3-57] |
| పొల్పగు ... | చవికె: | పొల్పగుంజవికె [మను 5-76] |
| అమరు ... | తుమ్మెద: | అమరుందుమ్మెద [వసు 2-72] |
| పోలు... | తెలనాకులు: | పోలుందెలనాకులు [పాండు 1-26] |
| ఎసఁగు ... | నసుఱు: | ఎసఁగున్ననుఱు [ప్రభావ 5-12] |
| పొల్పారు ... | రాముఁడు: | పొల్పారుఁ రాముఁడు కవిసం1-16] |

బహుళ గ్రహణముచే-ఊరుంగాయ అనుచో [ఆముక్త 1-82] నుకు నిత్యంబు.

ఔకుఁ దద్ధర్మార్థ విశేషణంబునకు నచ్చుపరంబగునపుడు నుగాగమంబగు. 30

| | | |
|---|---|---|
| ప్రబలమౌ ... | ఈశ నిర్దయవృత్తి: | ప్రబలమౌనీశ నిర్దయవృత్తి [హ.న. 3-26] |

షష్ఠీసమాసంబున దుగాగమంబున కచ్చుపరంబగునపుడు నుగాగమంబు విభాషనగు. 31

| | | |
|---|---|---|
| తనదు .... | అఖిలరాజ్యము: | తనదు నఖిలరాజ్యము [బసవ 64 పు] తనదఖిలరాజ్యము. |

| | | |
|---|---|---|
| నీదు .... | ఔదార్యంబు: | నీదునౌదార్యంబు [కాశీ –269] నీదౌదార్యంబు. |
| నీదు .... | అయసమగ్రత: | నీదునయసమగ్రత, నీదయ సమగ్రత [రాఘవ 1–44] |

కొండొకచోఁ గెంపు శబ్దంబునకు లుప్తశేషంబునకు మకారంబు పరంబగు నపుడు మీఁదిహల్లునకు ద్విత్వంబగు. 32

| | | |
|---|---|---|
| కెంపు .... | మోవి: | కెమ్మోవి [విరాట 2–310: హర 4–19, శృ. నై. 2–26] |

బహుళగ్రహణముచే 'కెంపుమోవి' [పాండు 3-67] యను ప్రయోగంబబాధితంబయ్యె.

ఒకానొకచో లుప్తశేషంబగు క్రిందుశబ్దంబు మీఁది హల్లునకు ద్విత్వంబు గానంబడియెడి. 33

| | | |
|---|---|---|
| క్రిందు .... | గాలి: | క్రిగ్గాలి [బసవ. 243 పు] |
| క్రిందు .... | ఊట: | క్రియ్యూట [పాండు 1-118; పండితా. పర్వత 240 పు] |

వెన్నడాదుల నెఱయ తగు. 34

### ప్రష్టము

అదాదులు పరంబగునపు డేదంతంబునకు నుగాగమంబగు. 35

| | | |
|---|---|---|
| నాల్గుకోటులే .... | ఆ: | నాల్గుకోటులేనా [ఇందుమ] |
| రాజసింహముల తోనే .... | ఆ: | రాజసింహములతోనేనా [విజయ 3–163] |

నిర్దేశార్థకంబగు గోశబ్దంబున కచ్చుపరంబగునపుడు నుగాగమంబగుఁ బరుషములు పరంబగునపుడు వైకల్పికంబుగ నగు. 36

| | | |
|---|---|---|
| ఇదిగో .... | అయ్యా: | ఇదిగోనయ్యా (కళా 4–143) |
| ఇదిగో .... | పురుషాహ్వయము: | ఇదిగోఁ బురుషాహ్వయము (కళా 1–76) |
| ఇదిగో .... | కానంబడెడి: | ఇదిగోకానంబడెడి (వరాహ 6–84) |

ఇల్లున కాలుకర్థము పరంబగునపుడు నుగాగమంబు లేదు. 37

ఇల్లుయొక్క .... అలు: ఇల్లాలు. (అరణ్య 6-180; రాఘవ 1-49 మొ)

ఇల్లున కిట సొపవిభక్తికము రామి ప్రాయికగ్రహణముచేతనని యెఱుంగ నది. [బా. అచ్చిక 29]

ప్రథమమీఁది పరుషంబులకు గసడదవలగు. 38

| | | |
|---|---|---|
| చే .... | చమరికొంచు: | చేసమరికొంచు [ఆది 6-206] |
| చాయ .... | తలిర్పన్: | చాయదలిర్పన్ [కర్ణ 3-219] |
| కేతనంబు.... | తునిమి: | కేతనంబుదునిమి [భీష్మ 1-251] |
| సమాధిశ్రీ .... | పాటింపుము | సమాధిశ్రీవాటింపుము (అశ్వ 2-219] |
| సురరాజ్యశ్రీ .... | పాలింపంగ: | సురరాజ్యశ్రీవాలింపంగ [ఉద్యో 1-142] |
| కలికాశ్రీ .... | తనువల్లికకు: | కలికాశ్రీదనువల్లికకు [విక్రమా 1-157] |
| వయశ్శ్రీ .... | చన: | వయశ్శ్రీచన (మను 3-105) |

ఇక్కార్యంబు భారతేతరకృతులందుఁ గొన్ని యెడల గానంబడదు.

అందచేతన వాచకంబులకు :

| | | |
|---|---|---|
| చే .... | తవులు: | చేతవులు (హరి ఉ.7-22) |
| చే .... | చాఁచ : | చేచాఁచ (పాండు 3-87) |
| ఇలు .... | పయోధి : | ఇలుపయోధి (హ.వ 1-6) |
| నగరి .... | పురమతల్లి: | నగరిపురమతల్లి (రాఘవ 1-1) |

అన్యంబులకు :

| | | |
|---|---|---|
| సముదాటో .... | పంక్తి: | సముదాటోపారి పంక్తి |
| పారి .... | రథుఁడు: | రథుఁడు (రాఘవ 1-2) |
| పతి .... | తత్త్రాణ సమయము: | పతితత్త్రాణసమయము (హ.న. 3-43) |

వయశ్శ్రీ ... చన : వయశ్శ్రీ చన [సును 3-10]

కాకు సంబోధనావ్యయంబులమీఁదం గసడదవలురావు. 39

కాకు స్వరంబులకు:

| | | |
|---|---|---|
| వీరలంగొనియే .... | చక్కంబె | వీరలంగొనియే చక్కం |
| | ట్టువాఁడ: | బెట్టువాఁడ [ఉద్యో 2-250] |
| వోయినట్లే .... | పోనిత్తురు: | పోయినట్లేపోనిత్తురు [ఉద్యో 3-45] |
| కిదే .... | కురువంశ: | కిదేకురువంశ (ఉద్యో 3-171) |
| ఇంతే .... | పో: | ఇంతేపో (ఉద్యో 1-321) |
| తునిసెనో .... | తేరు: | తునిసెనోతేరు (ద్రోణ 1-80) |
| దగ్గరుమా .... | తలఁకక; | దగ్గరుమాతలఁకక (ద్రోణ 5-128) |
| రమ్మా .... | చూతము: | రమ్మాచూతము (విరాట 2-89) |

ఒకానొకచో 'అగున, య్యవదాఅవపాలు' (ఛందో 1-59) అను భారతేతర ప్రయోగమొకండు గాననయ్యెడి.

**సంబోధనాంతంబులకు :**

| | | |
|---|---|---|
| పుత్త్రి .... | తెచ్చు: | పుత్త్రితెచ్చు (అను 4-23) |
| నికృష్టా .... | తునిమెద. | నికృష్టాతునిమెద [కర్ణ 2-329] |
| మహాత్మా .... | తెలివొందె: | మహాత్మాతెలివొందె (శాంతి 6-559) |
| శరణ్యా .... | కావు; | శరణ్యాకావు (కర్ణ 2-77) |
| తల్లీ .... | కృప: | తల్లీకృప (అను 1-210) |

కొండొకచో "సాధు నైశ్చలహృత్సార । సవివరింపు" అను (హ. ప. 2-90). భారతేతర ప్రయోగమొండు గానంబడియెడి.

అవ్యయంబులందుఁ బ్రతిపదోక్తములకు.

| | | |
|---|---|---|
| ఏల .... | తొలంగెన్: | ఏలతొలంగెన్ (శాంతి 2-66) |
| ఏలా ... | పొరిగొందు: | ఏలాపొరిగొందు (ద్రోణ 3-188) |
| ఓహో .... | తక్షక; | ఓహోతక్షక (ఆది 2-234) |

ఇట్లుదపంబు [ఉ హ 4-53) ఆహాపుట్టింపడె (శృ. శా. 2-188) యను భారతేతర ప్రయోగంబులు చూపట్టెడు.

లాక్షణికావ్యయంబులందుక్త్వార్థకములకు:

| | | |
|---|---|---|
| ఆర్చి .... | తన; | ఆర్చితన (విరాట 3-202) |
| చూచి .... | తగన్: | చూచితగన్ (ఉద్యో 3-80) |
| చేసి .... | పడయు: | చేసిపడయు (ద్రోణ 2-299) |
| కోరి .... | తినన్: | కోరితినన్ (అను 4-291) |

అయికాదేశంబగు వక్రతమంబుమీఁదసహితము గసడదవలుగావు.

| | | |
|---|---|---|
| ఏరువారై ... | తగవు : | ఏరువారైతగవు (విరాట 3-12) |
| వారై .... | చన్న : | వారై చన్న (ఉద్యో 2-250) |
| గురువై ... | తనరుట : | గురువై తనరుట (అనుభవ 54) |

కొండొకచో భారతేతరకృతులందు క్త్వార్థకంబుమీఁద గసడదవలు చూపట్టెడు.

| | | |
|---|---|---|
| వాల్చి .... | తబీయంబు: | వాల్చిదబీయంబు(రాజశే 2-77) |
| గెలిచి .... | తన: | గెలిచిదన [నరస 4-67] |
| తప్పి .... | తారి; | తప్పిదారి [పాండు 1-211; ఉ.నా. 1-123; ఆముక్త 2-27 ఉ. రా. I-123] |

క్తవదర్థకంబునకు:

| | | |
|---|---|---|
| చన్న .... | పిదప; | చన్నపిదప (ఉద్యో 4-249) |

వ్యతిరేకక్త్వార్థకంబునకు:

| | | |
|---|---|---|
| తొరంగనీక .... | తొలఁగ | తొరంగనీక, తొలఁగ [శాంతి 2-253] |

**వేగశబ్దంబుమీఁద గసడదవలురావు. 40**

| | | |
|---|---|---|
| వేగ .... | తెగంబాఱకు; | వేగ తెగంబాఱకు [ఉద్యో 3-25] |
| వేగ .... | తొలఁగ: | వేగతొలఁగ [శల్య 1-241] |
| వే .... | చని: | వేచని [విరాట 2-89] |
| వే .... | తూఱును: | వేతూఱును [కర్ణ 1-88] |

ద్వంద్వేతర సమాసంబులందుఁబదంబు మీఁది పరుషములకు గసడదవలురావు. 41

| | | |
|---|---|---|
| ఈ .... | చక్రము; | ఈచక్రము [ఆది 8-257] |
| ఈ .... | కన్నియ: | ఈకన్నియ [ఆరణ్య 7-190] |
| ముద్దుసేయు — | కొడుకు: | ముద్దుసేయుకొడుకు [విరాట 1-98] |
| నీయొక్క .... | చేతికి: | నీచేతికి [ఆది 8-257] |
| నీయొక్క .... | చెప్పిన పెద్దలు: | నీచెప్పిన పెద్దలు (ఉద్యో 2-250) |
| నీయొక్క .... | కొడుకు: | నీకొడుకు [ఆరణ్య 7-190] |

ఈనియమంబునకు భారతేతర కృతులందుఁ గొండొకచో వ్యతిక్రమంబు గానంబడియెడి.

| | | |
|---|---|---|
| పలు .... | పగతురగములు: | పలువగతురగముల [హ.వ. 1-53] |
| ఏ .... | చుట్టంబులు: | ఏసుట్టంబులు [కాలహ 3-65] |

నలుగడాదులు సమాసాశ్రయ విధులని యెఱుంగునది. నలుగడలు, ఇరుగడలు, వేవణములు.

క్రియలమీఁది పరుషములకు గసడదవలగు. 42

| | | |
|---|---|---|
| లేదు .... | తలఁప: | లేదుదలఁప (శాంతి 3-419) |

రారుకదా. వత్తురు పోదురువంటి రూపంబులు (బా. సంధి 13) భారతేతర కావ్య సమ్మతంబులని యూహించునది.

ఉదంతేతరంబుల కచ్చుపరంబగు నపుడు టుగాగమంబు గొండొకచోఁ జూపట్టెడి. 43

| | | |
|---|---|---|
| పల్లె .... | ఊళ్లు । పల్లెటూళ్లు | [పల్లెనాఁటి సీమపల్లెటూళ్ల శ్రీనా. చాటువు] |
| దుక్కి .... | ఎద్దు: | దుక్కిటెద్దు [నీలా 1-49] |

ఇటదుక్కెద్దనియు రూపంబు. [భోజ 2-16]

కొన్ని యెడలఁ బుంపుల కచ్చుపరంబగునపుడు టుగాగమంబు గానంబడదు. **44**

| | | |
|---|---|---|
| నిబ్బరపు .... | ఉబ్బు: | నిబ్బరపుబ్బు [వరాహ 2-64; పెద్దన - ఉత్పలమాలిక] |
| క్రపపు .... | అనఁటులు: | క్రపపనఁటులు [య 4-28] |
| ఇల్లటపు .... | అల్లుఁడు: | ఇల్లటపల్లుఁడు [రామా 3-44; నీలా 1-14] |
| పట్టపు .... | ఏనుఁగుఁ | పట్టపేనుఁగు [కళా 8-31] |

పెక్కులోనగు వానియుత్తున కచ్చుపరంబగు నపుడు టుగాగమంబులేదు. **45**

| | | |
|---|---|---|
| పెక్కు .... | ఎడలు; | పెక్కెడలు [ఉద్యో 4-246] |
| తక్కు .... | అన్ని గర్భములు; | తక్కన్నిగర్భములు [సౌప్తిక 2-80] |

జవ్వన శబ్దంబున కాలుశబ్దంబు పరంబగునపు డత్వంబున కుత్వంబును రుగాగమంబు నగునండ్రు. **46**

| | | |
|---|---|---|
| జవ్వనము .... | ఆలు; | జవ్వనురాలు [అహో 265 పు. చూ. సమాస.] |

రుగాగమంబు పరంబగునపుడు గొడ్డు శబ్దంబునుత్వంబునకు లోపంబు విభాషనగు. 47

| | | |
|---|---|---|
| గొడ్డు .... | ఆలు; | గొడ్రాలు (శృ. నై 7-138; పాండు 3-127; ఆం. భూ. 168 వ) గొడ్డురాలు [సారంగ. 3-50] |

ధ్వన్యనుకరణ శబ్దంబుల కనుధాతువు పరంబగుచోఁ గొన్నియెడల రుగాగమంబు వగు. **48**

| | | |
|---|---|---|
| కొంగొంగు .... | అనఁగ; | కొంగొంగురనఁగ (హర. 5-16) |
| గుభేలు .... | అనఁగ: | గుభేలురనఁగ (రామా 6-99) |

ఇత్యాదులు,

అనుకరణంబునం గొన్నియెడల సంస్కృతవాక్యంబు తుది పదంబు లుప్త విసర్గకంబగుచోఁ బ్రాతిపదికతుల్యంబగు 49

ప్రాతిపదిక తుల్యత్వం బతిదేశించుటంజేసి నామవిభక్తులు యథాసంభవంబుగ నగునని యెఱుంగునది.

| | | |
|---|---|---|
| యథాశివ మయోవిష్ణుః | అను: | యథాశివమయోవిష్ణుఁడను (బసవ 488 పు) |
| అభాగ్యత స్స్వయంవిష్ణుః | అనుట: | అభ్యాగతస్స్వయంవిష్ణుఁడనుట. (పాండు 4–156) |
| అభాగ్యత స్స్వయంవిష్ణుః | నాన్: | అభ్యాగతస్స్వయంవిష్ణువునాన్ (జై. భా. 7-208) |
| పాపీచిరాయుః | అను: | (పాపీచిరాయువను (వసు 4–35) |
| నమోనహి ధర్మః | అటంచు: | నమోనహిధర్మ్మ పటంచు (బైచ. పంచ 1-508) |

సర్వనామ తవ్యద్భిన్నంబులగు సంస్కృతపదంబుల తుది మకారంబున కనుకరణంబున లోపంబును బ్రాతిపదిక తుల్యత్వంబు నగు, 50

| | | |
|---|---|---|
| నయనంప్ర ధానమ్ | అను: | నయనంప్రధానమను (విరాట 2-35) |
| కృతంకర్మ శుభాశుభమ్ | అను: | కృతంకర్మశుభాశుభంబను (బసవ 474 పు) |
| ఇహైవఫలమ్ | అన: | ఇహైవఫలంబునన (పండితా మహిమ 41 పు) |
| తస్మాద్గ్రాహ్యమ్ | అనియు: | తస్మాద్గ్రాహ్యంబనియు (శవత105ప) |
| కవయో వదంతికావ్యమ్ | అని: | కవయోవదంతికావ్యంబని (కవిజ) |
| శుభస్య శీఘ్రమ్ | అనంగ: | శుభస్యశీఘ్రంబనంగ (వరాహ 11–54) |
| దుఃఖితేమనసిసర్వ మసహ్యమ్ ... | నాన్: | దుంఖితేమనసి సర్వమసహ్యమనాన్ (మను 3–99) |

| | | |
|---|---|---|
| దుఃఖితేమనసిసర్వ మనహ్యమ్ | అటంచు: | దుఃఖితేమనసిసర్వమనహ్యమటంచు (వరాహ 12-9) |
| శీతాంశో రమృతార్ణవమ్ | అను: | శీతాంశోరమృతార్ణవంబను (వసు 3-172) |
| మరణేసతి కింభయమ్ | అన్న: | మరణేసతికింభయమన్న (పాంచు 3-70) |
| పరోపకారా ర్థమిదంశరీరమ్ | అను: | పరోపకారార్థమిదంశరీరంబను (శృ.శా. 3-233) |
| నదైవంకేశ వాత్సరమ్ | అటంచు: | నదైవంకేశవాత్సరంబటంచు (నిరం 2-102) |

కొండొకచో, "శ్రీవత్సస్వంబుచెప్పి" (క్రీడా. 201 ప) యను ప్రయోగ విశేష మొకండు చూపట్టెడు.

**ఒకనొకచో భారతేతర కృతులందనుకరణంబునఁ గుఱుచ గానంబడియెడి.** 51

| | |
|---|---|
| గ్రామోనాస్తికుతస్సీమా....అనిన: | గ్రామోనాస్తికుతస్సీమ యనిన (అనుభవ. 174 ప) |
| రామోఽఘసంహర్తా... అనఁగ: | రామోఽఘసంహర్త యనఁగ (అప్పక 5-98) |
| సహరేస్తుపరస్త్రాతా .... అనుట: | సహరేస్తుపరస్త్రాతయనుట (అప్పక. పీఠిక 17) |

**అనుకరణంబున నట్టి ప్రభృతులును వాదంబడు.** 52

"దక్షస్య పుర్యార్థ పురంతముక్తః అట్టి దివ్యక్షేత్రంబునందు" (భీమ 4-155)

**స్వస్తి ప్రభృతులు సంస్కృతావ్యయంబు లనుకరణ విరహితంబుగఁ బ్రయోగింపంబడు.** 53

స్వస్తి (ఆది 2-231) వృథా (జై. భా. 8-209; మను 4-87; కళా 8-179) అథవా (జై. భా, 4-94; వరాహ. 2-156; అనుభవ 127 ప) సరదా

(కాశీ 7-121) అన్యథా (బసవ 346 పు) సదా (ఆముక్త 3-70; సుదక్షి 16-; విజయ 3-128) సర్వత్ర (జై. భా. 7-131; అముక్త 1-37) సాధు [కాశీ 3-143; శృ. నై 3-16] మా.మా [భాగ 9 స్కం. 5-47] ఉపరి [మను 3-55] ప్రతి [బసవ 469 పు; హరి, ఉ. 10 ఆ., జై. భా 8-107; కాలహ 1-153; ఆముక్త 4-230; విజయ 1-94]

**అనుకరణంబునఁ గొండకచో నాచ్ఛిక శబ్దంబులు పరంబగునపుడు సంస్కృతసంధికార్యంబులు చూపట్టెడి. 54**

| | | |
|---|---|---|
| ప్రణీతౌ ... | అనంగ: | ప్రణీతావనంగ [పండితా 22 పు–నూ. ము] |
| కాశ్యదీపౌ ... | అనంగ: | కాశ్యదీప్తావనంగ [కాశీ 5-10] |
| కామాంధోహి ... | అను: | కామాంధోహీనపశ్యత్యను |
| నపశ్యతి | | [భోజరా 7 ఆ] |

**అనుకృతిని మణిప్రవాళరచన గ్రాహ్యంబగు. 55**

"అనయము సేతులందుభవదంఘ్రి సరోజయుగం నమామి నె. మ్మనమున సంస్మరామి యనుమాటల నిన్ పరివస్కరోమ్యహ, మ్మనుచు మణిప్రవాళమున నంకన సేయుదు" [వృషా] అనుకరణ విరహితంబులు ప్రయోగ సిద్ధంబులు గ్రాహ్యంబులు. మూర్ధ్నిధరించు [పండితా 15 పు] శిరసావహించు [వరాహ 7-26, నరస 1-119; ఉద్భటా 2-39]

ఇది సంధిపరిచ్ఛేదము

# ముక్తలక్షణకౌముది

## తత్సమపరిచ్ఛేదము

అప్రయుక్తంబులు, దోషవివర్జితంబులు, ప్రయోక్తవ్యంబు లనియార్య
లంద్రు. 1

స్పష్టము.

ద్వితీయకును గొండొకచో నుగాగమంబగు. 2

సత్యవతినిన్ (ఆది 4-191) నన్నునున్ (అరణ్య 3-107) భాంగ
సరినిన్ (అరణ్య 2-163) మైథిలినిన్ (విర్వ 9-52)

దేవతాత్మ బోధకంబులగు నమహత్పుంలింగంబులు గొన్నియెడల
మహత్కార్యయోగ్యంబులగు. 3

పన్నగులు (ఆది 2-136) ఉరగులు (ఆది 1-105) ప్రాణుండు,
అపానుడు (అను 5-260) కాముండు, క్రోధుండు (అశ్వ 2-153) గోత్రుడు
(వసు 1-62) ఘనులు [వసు 1-10]

సింహాదుల, కుత్తర పదంబులకు మహద్వివక్ష విభాషనగు. 4

కురుసింహముల్ (సభా 1-193) పురుషసింహములన్ (సభా 2-267)
మనుజసింహులు (ఆది 8-289) కపివృషభులు (ఆది 1-32) అశ్వపుంగవు
(అశ్వ 3-217) అశ్వోత్తమున్ (ఆది 2-29) తురగోత్తము. (ఆది 2-3
అశ్వరాజు [అరణ్య 3-63]

ఒకానొకచో నర్థవిశేషంబులందు నహితము మహద్వివక్ష చూపట్టెడు. 5

వాయసుఁడు (కర్ణ 2-74) వానరుఁడు (భా. రా. సుందర 341 వ)
మర్కటుఁడు (భా. రా. సుందర 337) భల్లూక ; (ద్వా 1-257)

కొన్నియెడల సహకారాదుల మువర్ణకమున కామంత్రణంబున లోపంబు
విభాషనగు. 6

సహకార ; మత్ప్రియసహకారుఁ బున్నాగ ; పున్నాగుఁదిలక ; భూతన
తిలకు [అరణ్య 2-95] కదళీకాకాంతార ; [కాశీ 2-140] అనఘ మాన

[హ. వి. 3–15] హాలింగ। హాలింగ। హాలింగ। యనుచు (బసవ 166 పు తాళంబ। కానవేతాళవల్లనివిఁ, గుందంబ। కానవేకుందరదన (భా.రా. అరణ్య 2-26) ఓలింగము। వినుం. (కాలహ 3-67).

**జనశబ్దంబునకు జనవాచకంబగు లోకశబ్దంబునకు మహత్త్వంబు విభాష నగు. 7**

జనులు (పాండు 3-105) జనముల్ (ప్రభావ 1-6) లోకము [కవిక. ఆ,] లోకులు బసవ 237 పు; కవిక 1 ఆ) మహత్త్వంబున లోక శబ్దంబు నిత్యబహు వచనాంతంబు.

**పుంలింగంబులు గణ జంగమ శబ్దంబులు మహద్వాచకంబులు గ్లీబ తుల్యంబులుగఁ గానంబడియెడి. 8**

గణము (బసవ 92 పు) జంగమము (బసవ 267 పు)

**నాకి శబ్దంబు బహుత్వంబునంద ప్రయోగింపంబడు. 9**

నాకులు (వసు 5-34; అప్పక 1-90) నాకి నమితిత్యాదులు [కు. సం 4-39] సిద్ధసమాస ఘటితంబులని యెఱుంగునది.

**జన శబ్ద బహు వచనరూపంబు మహత్తునకుంబోలె మహతికి విభాష నగు. 10**

అంగనాజనులు (ఆది 3-156) అంగనాజనములు

**తాతహంస శబ్దంబులు పితృయోగి విశేష వాచకంబులు స్త్రీ తుల్యంబులగు 11**

తాత [పాండు 4-83; కాశీ 7-74; రామా 3-42] హంసలు [కాశీ 3-237]

**మహద్వాచకంబు వత్సశబ్దంబు, రాజార్థకంబు దేవశబ్దంబు సంబోధనంబులంద, ప్రయుక్తంబులగు; నగుచో వాని సంబుద్ధి దుఙ్నకు లోపంబగు. 12**

వత్సా। [పాండు 1-205] దేవా ? [ఆది 1-20]

**కువర్ణకంబు పరంబగునపుడు పువర్ణాంతశబ్దంబులకును గొన్నియెడల నగాగమంబు చూపట్టదు 13.**

పసుపుకిచ్చిరి. (శృ.నై. 7-12) సితూపుకోర్వక. (కవిక. 3-119)

వలనకర్ణకంబు పరంబగునపుడును గొండొకచో నగాగమంబు చూపెట్టెడు. 14

వర్గ్గతంబున వలనను. (శాంతి 6–200)

ఉదంత సంస్కృతనామంబుమీఁది సంబుద్ధియుజ్జున కుకారంబులు హ్రస్వదీర్ఘంబులుం బర్యాయంబున నాదేశంబులగు. 15

విష్ణు! (బనవ 468 ప) జరత్కారూ (ఆది 2–154)

మధ్యమపురుష క్రియ యత్యాహార్యంబగునపుడు నారగాగమంబు విభాషనగు. 16

కురువృద్ధులార! భృశకోపనుఁ డీతఁడు నన్ను నేరి దుర్జనుఁడిట యీడ్చి తెచ్చె. (సభా 2–218) సంభ్రమకారణమేమి సంయముల్. [భా.రా.అయో 402]

అదంతంబయి ద్విత్వయుక్తలోపధంబయిన మహత్తుమీఁది విభక్తిలకారంబునకును రేఫంబు వైకల్పికంబుగ నగు. 17

మలల్లాల, విఱుతున్. (విరాట 1–223: 5–323) మ, ల్లురకున్, (రామ 1–59)

మను కటు పటు శబ్దంబులకు మహత్తులకు నిత్యంబుగ వటుశబ్దంబునకు వైకల్పికబుంన్ వువర్ణకంబగు. 18

మనువు [శృ. నై. 7–72] మనువు, కటువు, పటువు, [కావ్యాలం. 9–30] పటుండు, [హర 4–15; భాగ, 8 స్కం–529] వువర్ణకంబు వుగాగమంబున కుపలక్షణంబు: వటువులు. [ప్రభావ. 1–105]

అమహత్తుల కదంతేతరంబుల కేకాక్షరంబులకుఁ గొన్నియెడల మువర్ణకంబగు. 19

మోము, సాము, గాము, గీము – ఇత్యాదులు.

దీర్ఘముమీఁది మువర్ణకంబునకు మామిడియుఁ బూర్ణబిందుపూర్వక బువర్ణంబును లేవు. 20

మోము, సాము, గాము, గీము, ఏతాము, లాతాము, ఇత్యాది.

**మాంధాత్రభియాతృ శబ్దబులంలకును నత్వశ్రీవద్భావంబులు విభాష నగు. 21**

మాంధాతృఁడు. [అరణ్య 3-198] మాంధాతృన్, [ఆది 2-224] మాంధాత, [కవిక 2-58] అభియాతృఁడు. [భాగ.... ] అభియాత

**అవ్యయంబులుగొన్ని సంస్కృతసమత్వంబున మువర్ణకాంతంబులగు; నగుచోఁ గొన్నింటఁ గించిదర్థభేదంబును జూపట్టెడు. 22**

సాయము [శృ. శా. 3-84] పద్యము [కు.సం 1-12] అర్థభేదంబునకు; ఇహము, వరము. [ఆది 1-139; 4-82; 6-274: అరణ్య 5-81] అవ్యయంబుల దీర్ఘంబున కిందుహ్రస్వంబు గొండొకచోఁ గానంబడియెడి. వృథ [ఆది 3-204]

**అవ్యయంబులు "తుచ" శబ్దంబులు దీర్ఘంబు వడసి యుండఁ బ్రయోగింపంబడు. 23**

తూ.చా.తప్పక. [శృ. శా. 4-134; కాళహ 1-20; విక్రమా 1-190] రాజశే 2-102]

**వాచా శబ్దంబునకుఁ ద్రిశబ్దవిరహితంబున కిందుయోగంబు మృగ్యంబు. 24**

త్రివాచన్. [వరాహ 41-64]

**తద్భవదేశ్యనామంబుల తుది దీర్ఘంబునకుఁ గొండొకచో హ్రస్వంబు విభాషవగు. 25**

పల్లకులు [జై.భా. 3-61] పల్లకి. జై.భా. [8-85] పల్లకీల్ [య 1-28 నవల (విక్రమా 5-173-శ.ర.] నవలా [మను 2-25: వసు 1-130] లకోరి [విజయ 1-146] లకోరీ [మను 4-28] తేజులు. [బసవ. 126 పు] తేజీ. [నరస 5-22]

**ఇత్తునకు బహువచనంబుపరంబగునపుడు కాకు నకారంబు గాదు. 26**

కాకు నకారంబగునని యొకండు వలికెనది, యవిచారమూలకంబు

చతుర్దశి.... చతుర్దశులు ] అను 4-147]

రశ్మి .... రశ్ములు [శల్య 1-104; ఆముక్త 4-87, 145]

రాసులను రూపంబు తద్భవ రాసి శబ్ద బహువచనంబని యెఱుంగునది తత్సమంబులం గోటి పిప్పలి శబ్దేతరంబులకును బహువచనంబు పరంబగునపు డుత్వలోపంబు గొండొకచోఁ జూపట్టెడి. 27

దృష్టి .. దృష్టు, [ఆది 8–106; 7–160; విరాట 4–74, 114] దృష్టు ను. [కు సం. 4–39] శివభక్త జనుల మీదివ దృష్టు గాఁగ [బసవ 67పు] ర, తిమ్మరుల యందలముల దృష్టువాలిచె, [కళా 7–147] భంజకుల [క్రీడా 117 ప] క్లిష్ట [పండితా 116 పు] నిఘంట్లు [పండితా 140పు] అశిష్టు [పండితా 13 పు] ప్రభాకరభట్లు [బసవ 94 పు] కొన్ని ప్రతులందు "నారాయణభట్లు" [ఆది 1–25 సంశో] అను పాఠంబు చూపట్టెడి.

**భట్టశబ్దంబు డుజ్జునకు లోపంబు నిత్యంబుగ నగు. 28**

నన్నయభట్టు [ఆది 1-25] నారాయణభట్టు, [ఆది 1–24] కంకభట్టు [విరాట 5–250]

**ఒకానొకచో గ్లౌశబ్దంబు డుజ్జునకు లోపంబు చూపట్టదు. 29**

గ్లానికుల నృపతుల (కావ్యాలం. 9–37) దీనికిఁ బ్రయోగాంతరంబు మృగ్యంబు.

**ధూమకేతు శబ్దంబు వువర్ణకంబునకు లోపంబు విభాషనగు, 30**

ధూమకేతు. (పండితా. 319 పు) ధూమకేతువు. (కాలహ 3–149)

**చరిత్రాది గణగణ్యంబులు సమాసఘటితంబులు గాను గానంబడియెడి. 31**

ఉత్తరపదంబున : ఆనందచిహ్న [బసవ 119పు] రుద్రచిహ్నలు (కు. సం. 1–23; బసవ 180పు] వ్యవహారచిహ్న [భీమ 4–72] ఇనోష్మ [ఆముక్త 2–16] కలుషగహన దమన [భాగ 3–170] పిశ్యంక [శాంతి 2–210] పాదరక్షాన్వర్ (బసవ. 201పు) (రహస్యలేఖ) ప్రభావ 3-134] సాధుసంసర్గ [అరణ్య 5–81] సంస్కృతచిత్తుల సంసర్గ: భోజరా 4 ఆ] పూర్వపదంబున : అఖండబిల్వపత్రి. [పండితా] మాంజిష్ఠతెర [హర 7–137] మూలదుంప (భీమ 5–157) మృదుల గోధూమ సరులు. [శివరా 2–61] రుద్రాక్షపక్కెరల్ [బసవ] రుద్రాక్షపూస [శివరా 4–59] శూలకుట్టు [బసవ 40 పు]

**అమహత్తులగు శరణాది శబ్దంబుల కదంతంబులకుత్వ స్త్రీవద్భావంబులు విభాషనగు. 32**

శరణు (ఆది 1-7) శరణు శరణు (అను 5-350; ఉ. రా. 1-62) శంఖులు (కు.సం. 12-5) బహురూపులు (బసవ 280 పు) చిత్రరూపులు (అను 5-55, ఉద్యో 4-116; భీష్మ 2-157) సంక్షేపరూపు (కవిజ) పరివార సన్నాహ బిరుదు. (నిర్వ 1-35) భండారు (శృ. శా. 4-179) పక్షంబున – శరణము, శంఖము, రూపము, బిరుదము, భండారము.

**స్వర్గివాచి దేవ శబ్దంబు బహుత్వంబునందుచు ప్రయోగింపంబడు. 33**

నిర్మిత కర్మాల నిర్దేవుల (పండితా) శ్రీమహాదేవు డన్నామంబులున్న, వే మహినిటువంటి యితర దేవులకు (బసవ 477 పు) ఆదేవదేవు లిరువురు. (కర్ణ 3-254) బ్రహ్మదేవులు (హంస 1-190) అట్లు రహస్యంబునం దాత్మదేవుల (లంకా 1-10 దేవ+లు; దేవి+లు) పలిదేవుల్ ముగురేకమైన (లంకా 5-25) పరమాత్మ వాచకంబగు దేవశబ్దంబున కేకత్వమునందే ప్రయోగంబు: దేవుఁడు.

**ఒకానొకచో ద్వివచన బాహువచనంబులగు శబ్దంబుల బహువచనమున కేకవచనంబు చూపట్టెడు. 34**

దంపతి (కాశీ 4-169) అశ్విని (భోజ 7-245) అప్పు [నరస 1-67 వసు 1-36] దారము (ఉ. నా. 3 ఆ) దారశబ్దము, [హ. వ. 4-30; రాఘవ 1-43] దార [మార్కం] శబ్దకత్వమరూపమనియెఱుంగవలయును. పక్షంబున – దంపతులు, అశ్వినులు [అరణ్య 3-190] అప్పులు, దారములు, [అను 4-93.]

**పుంలింగంబులయి మహద్వాచకంబులయిన ప్రధానాదుల తుది యత్వంబునకుఁ గొండొకచో నిత్వంబునగు. 35**

ప్రధాని [బసవ 105, 124 పు; హర 1-30; శృ. శా. 4-32; పాండు 1-83] తాపసి [బసవ 274 పు; పాండు 5-159; కు. సం. 8-68] దాసి [పండితా; బసవ 470 పు] దాసానుదాసి. [బసవ 327 పు] భస్మాంగి [కు. సం. 2-21] భస్మత్రిపుండ్రాంగి [బసవ 418 పు]

**ఇయ వర్ణకంబు ఙ్యంతంబులగు స్త్రీవాచకంబుల మీఁద నొకానొకచోఁ జూపట్టెడు. 36**

తరుణీయలు [ఆది 8–175] తరుణీయ [కు.సం. 8–68] తద్వనే, చరియలు [కు. సం. 6–44] విటవిటియలు [కు. సం. 8–120]

**సంస్కృతసమంబులందుఁ గొన్నియెడల నర్థ విపరిణామంబు గానంబడియెడి. 37**

అనుమానము = సంశయము. [నిర్వ 6–10] పక్షము = పక్షపాతము; ఉద్యో 1–114; హరి. పీఠిక] సభికుడు = విభ్యుఁడు [విరాట 2–176; ఉ.రా. 8–92] వాహిని = కీర్తి [పాండు 1-40; ఘటికా 2–168] క్రియ = వలె [విరాట 5–38] లీల = వలె, [రామా 5–193] భేషజము = మోసము; [హర 3-90] పూజ్యము = శూన్యము [మను 4–105; పాండు 2-155] దృష్టి = దిష్టి. పాండు 3–64; ఆముక్త 1–42] ఇత్యాదులు.

**ఐముల్ ప్రత్యయాంతంబుల కిందుఁ బ్రయోగంబు నిర్బాధంబు. 48**

శయనోత్థాయము [శృ. నై. 8–3]

**తత్తత్పారిభాషికపదంబులు గొండొకచోఁ బ్రయోగంబుల గానం బడింయెడి. 39**

శరణుఁడు [బసవ 132 పు] భరితభోజనము [హర 2–126] భరితార్పణము [ప్రభులిం] తిరువారాధనము [పాండు 2–24] తిరుమజ్జనము. [పరమ తిరుమాళిగ [పరమ] కటకాముఖము [ఉ. హ 1–159; భీమ 4–138]

**వైదికపదంబులు కావ్యంబులందు యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులగు. 40**

మార్తాండుఁడు (ద్రోణ 5–377) ప్రభువిష్ణుఁడు (శాంతి 4-204) దుర్గి (పండితా 15) త్రియత్నుఁడు (బసవ 112పు) నికృంతనము (బసవ 821 పు) ఘర్మము = యజ్ఞము (ఆముక్త 3-19) పరిపంథి (ఉ.హ 2-174; జైభా. 5–79; రామా 1-63) పలిక్ని (నిరం 2–133) కొండకచో వైదిక ప్రత్యయాంతంబులుంగానంబడియెడి. కేకి (కు.సం 5-5) దంష్ట్రి భాగ 2–115; ప్రబంధ)

ఆర్ష ప్రయోగంబులార్య వ్యవహారదృష్టంబులు ప్రయోజ్యంబులు. 41

అతివిస్తారము (శల్య 2-388: భీష్మ 1-73 అశ్వ 3-206) త్రిణము (కు.సం. 6-109) పునీతము (భాగ 3-556) మాతృపితృ రక్షణము, (అను 2-471) మాతృపితృహీన (అను 2-227) పితృమాతృహీననై (కాశీ 5-311) ఇత్యాదులు.

ప్రాకృతశబ్దంబులుగొన్ని సంస్కృతత్త్వంబు వడసి ప్రయోగింపంబడు. 42

| ప్రాకృతము | సంస్కృతీకరణ రూపము | సంస్కృతసమము |
|---|---|---|
| ఆడీ [చండ. ప్రా.<br>సం. ఆటిః] | ఆడిః<br>[అమరః] | ఆడి [మార్గం 2 ఆ] |
| ఇంగాలో [ త్రి. ప్రా.<br>సం. అంగారః] | ఇంగాలః<br>[సర్వ. సం] | ఇంగాలము [భీమ<br>4-107] |
| కంకేలీ [కా. సూ.] | కంకేలిః [శీ]<br>[రాజని] | కంకేలి [హ.న 3-36;<br>శృ.శా 2-221] |
| కల్హారం [ ప్రా. ప్ర.<br>సం. కహ్లారమ్] | కల్హారమ్ | కల్హారము [కవిజనో-<br>శ. ర. అను] |
| గల్లో [ త్రి. ప్రా.<br>సం. గండమ్] | గల్లః<br>[అభి,చిం.] | గల్లము [కాశీ<br>7-29; పాండు<br>1-194; మను 3-116] |
| గుంభిఓ [ప్రా. మం.<br>సం. గుంఫితః] | గుంభితః | గుంభితము<br>[పాండు 2-77] |
| డోలా [ త్రి.ప్రా.<br>సం. దోలా] | డోలా | డోల [నిర్వ 7-7;<br>పాండు 5-279: విక్ర 5-23:<br>రామా 3-127] |
| తండో [ త్రి. ప్రా.<br>సం. దండః] | తండః<br>[శబ్దా.క] | తండము [కాశీ<br>3-138] |
| తటాకం [చండ.ప్రా.<br>సం. తడాగమ్] | తటాకమ్<br>[శబ్దర] | తటాకము [ఉ.హ<br>4-30] |
| ద్విరేభో [ప్రా.మం.<br>సం. ద్విరేఫః] | ద్విరేభః | ద్విరేభము<br>[భాగ 10-662] |

| | | |
|---|---|---|
| పట్టణం [త్రి. ప్రా. సం. పత్తనమ్] | పట్టణమ్ | పట్టణము నిరవ] 5-79; శృం శా 1-81] |
| ప్రాహుణకం [ప్రా. మం. సం. ప్రాఘుణకమ్] | ప్రాహుణకమ్ | ప్రాహుణకము [కాశీ 3-190 ఆముక్త 5-10] |
| ప్రాహుణం [ప్రా. మం. సం. ప్రాఘుణమ్] | ప్రాహుణమ్ | ప్రాహుణము [భీమ 3-15;6-5] |
| ఫాలం [చండ. ప్రా. సం. ఫాలమ్] | ఫాలమ్ [సర్వ. సం.] | ఫాలము [హ.న 1-33] |
| భిండివాలో [త్రి ప్రా; ప్రా. ప్ర. సం. భిందిపాలః] | భిండివాలః | భిండివాలము [భా.రా, యు....] |
| మంటవం [చండ. ప్రా. సం. మండపమ్] | మంటపమ్ | మంటపము [కాలహ 2-95] |
| మేంఠో [చండ. ప్రా సం. మేంఢః] | మేంఠః | మేంఠము [కాశీ 7-98] |
| వ్రయో [త్రి. ప్రా. సం. వ్యయః] | వ్రయః | వ్రయము [శాంతి 4-345; భీష్మ 3-309; కర్ణ 2-33; క్రీడా 288 ప; రుక్మాం 4-109] |
| సంఘాతో [చండ. ప్రా. సం. సంఘాతః] | సంఘాతః | సంఘాతము [వరాహ 5-96] |
| హేలా కా. సూ] | హేలా [అమరః] | హేల [శృం శా. 3-183; కాలహ 3-42; ఆముక్త 4-47] |

అవతారాదులు మహాజనవ్యవహార సిద్ధంబులు లాక్షణిక వచనల విలక్షణంబులయ్యు గ్రాహ్యంబులయగు. 48

అవతారము [హర 6-86; నృసింహ 1-21; పాండు 1-2- కా. సూ) ప్రౌఢిమ [శృం నై 1-12; రాఘవ 1-30-కా.సూ.] వాచా [వసు 3-101, సి.కౌ 452 బాలమ] ఇత్యాదులు.

శాస్త్రప్రయోగంబులయందు శాస్త్రంబె బలీయంబని యార్యులండ్రు. 44

ఇటనుటంజేసి మహాకవి ప్రయోగంబుల సాధుత్వంబున "స్థితస్యగతిశ్చింతనీయా" యను వాచోయుక్తి యనుసరణీయంబు.

### కతిపయ చింతనీయ పదంబులు:

అక్షోహిణి [ఉద్యో 1-236; 4-110;139; ద్రోణ 1-76]

అరథము] [కు.సం. 11-12,76,83,193; 12-51;171]

బుధ్నవత్ [రాఘవ 2-114]

కానినేయుఁడు [భీమ 2-114; 3-214]

కీర్తీ [భాగ 4-263]

కుర్వకము [కు. సం. 5-23]

కైవారము [శృ.నై. 7-89; కాశీ 7-5; హర 6-9; పండితా 118 పు]

గ్రహయాళువు [భీమ 3-213: మను 4-38]

గ్రహిళము [మను 4-121]

ఘుంటి [కాశీ 1-2;6-96; భీమ 2-283; ఉద్భటా 3-35]

దంపతీ [విక్ర ....]

దుర్ణయము [ఉద్యో 2-248]

ద్యోతి [కు.సం. 6-151; పండితా 184 పు

ధారుణి [ఆది 7-128; కు.సం. 11-139]

నద్వితీ(యము) యుఁడు [బసవ 428 పు; వరాహ 3-122]

పుష్పకోమలి [విరాట 1-157]

బాలకి (నిర్వ 3-43; క్రీడా 91 ప; పారిజా 4-16; భోజ 3-175)

ప్రతీహారి (ఉ.హ 4-92)

మధ్యరాత్రి, మొ॥ (ఆరణ్య) 7-26; బసవ 576 పు; జై.భా 6-3;7-118; ప్రభావ 5-7)

మాతృపితృదార పుత్రక భ్రాతృశత సహస్రకంబులు (శాంతి: 1-218)

మాసరము (పాండు 2-62); ఆముక్త 4-136)

యశశాలి, మొ॥ (ఆరణ్య 6-92 నృసింహ 2-21; కు.సం. 11-27; మను 6-79)

లసమానము (వసు 3-50; రాఘవ 1-65; నిరం 2-143)
వరషము; మొ॥ (కాశీ 7-40; భాగ 3-40; కు.సం. 12-214)
వాఙ్మనఃకాయములు (శాంతి 4-312; అరణ్య 7-228; పాండు 4-156
వాల్మీకుఁడు (కు.సం. 1-17)
విగుర్వణము (కు. సం. 12-47)
విగుర్వించు (ఆది 7-275)
విలోలాక్షములు (అరణ్య 3-264; కు.సం. 8-169)
వీవాదము (హర 7-60)
శ్రీకారము (శృ.నై. 3-183; ప్రభావ 2-68)
సఖుఁడు (శాంతి 3-48)
సమూహి (కు.సం. 12-171; బసవ 120 పు)
సాందీపుఁడు (పారిజా 3-38; ఉ.హ. 2-65)
స్నేహితుఁడు (పండితా. పర్వత 469పు)
స్పర్థాళువు (కవిక 6-219)
హేవాకము (భీమ 2-37; కాశీ 1-88; హర 3-67; వరాహ 11-1378; రాఘవ 3-121)

## ఇంకహలంత ప్రకరణము

### ఒకానొకచో సంస్కృతప్రాతిపదికం బిందు నామంబగు. 45

ఉగాగమద్విత్వంబులు విధాన సామర్థ్యంబునగునని యూహించునది.

కిమ్ము (మను 3-6 అహో 449 పు) కించిత్తు (జై.భా. 7-209; రాజశే 3-20) నమస్సు (ఆముక్త 6-99) పృథక్కు (అహో 327 పు) మహత్తు (బసవ 472 పు; హర 5-15) యావత్తు (బసవ 168 పు) హఠాత్తు (నిరం 4-63) భా.రా.యు 1278 ప. అప్పు (నరస 1-67; వసు 1-36) ముద్రణంబులందు విశ్రవస్సు (కాశీ 4-138) విశ్రవస్సునకు (కాశీ 4-138; భా.రా.యు 1278) ననుపాఠంబులు గానంబడియెడి. పథిశబ్దంబు సంస్కృతనామంబయగు, నగుచో దుదినకారంబునకు లోపంబగు. పథి (హంస 2-116)

చాంతంబులు ప్రథమైకవచనాంతతుల్యంబులు తఱుచుగనగు. 46

త్వక్కు (శాంతి 4-242) అంబువుక్కు (రామా 4-69) శాంతిముచములు) భా.రా. సుందర 153)

సమ్రాడ్విరాట్ శబ్దంబులు ప్రథమైకవచనాంతతుల్యంబులు విభాషనగు. 47

ద్వితీయైకవచనతుల్యత్వంబునందును వీని ప్రథమైక వచనంబునకు లోపంబగు. సమ్రాట్టు విరాట్టు, (శాంతి 2-272) సమ్రాజు (హరి. పూ. 2-50) విరాజు (కావ్యాలం 9-39)

సరిద్యోషిచ్ఛబ్దంబులు ప్రథమైకవచనతుల్యంబులగు. 48

సరిత్తు (అను 2-457) యోషిత్తు (శివరా 5-5)

ఉపనిషదాదులు ప్రథమైకవచనాంత తుల్యంబులుగఁ గానంబడియెడి. 49

ఉపనిషత్తు [కాశీ 2-69; 151; పండితా. పురాతన. 388 పు; క్రీడా 207; వెం॥ ఉపనిషది యనియూ రూపంబు గానంబడియెడి [పండితా 13 పు] తనూనపాత్తు [కాశీ 3-206] దృషత్తు [విరం 4-61; వరాహ 12-32] పరిషత్తు [కాశీ 7-233; హర 5-12] శరత్తు [శై. భా 6-11; ఆముక్త 4-146 శృం. నై 6-40]

క్షుచ్ఛబ్దంబు ప్రథమైకవచన తుల్యంబగు. 50

క్షుత్తు. [ఉ. రా' 8-72; 7-299; పాండు 4-153.] క్షుధశబ్దంబు క్షుధాశబ్ద తత్సమరూపంబని యెఱుంగునది, [అశ్వ 4-244; ఆముక్త 4-122; ఉ. రా. 7-304]

త్రిష్టుప్కకుప్ఛబ్దంబులు ప్రథమైకవచనతుల్యంబులుగఁ గానంబడియెడి. 51

త్రిష్టుప్పు [కాశీ 5-216; ఛందో 2-5; అప్పక 4-136] కకుప్పు [వరాహ] 10-147; 11-60; సర్వల 1-21; బాలస-222 పు.]

దృక్ఛబ్దంబు ప్రథమైకవచన తుల్యంబగు. 52

సుదృక్కులు, సదృక్కులు [ఉ. రా. 7-179] అదృక్కు [శాంతి 4-242] శసదృశశబ్దంబులు దృశాసదృశశబ్ద తత్సమంబులని తెలియునది.

తృట్ఛబ్దంబును బ్రథమైకవచనాంత తుల్యంబగు. 53

తృట్టు [పాండు 5-182] తృషశబ్దంబు తృషాశబ్ద తత్సమంబని యొప్పంగునది.

ప్రథమైకవచనంబున నెయ్యవి కాంతంబులగునట్టి హాంతంబులు ప్రథమైకవచనాంత తుల్యంబులగు. 54

ఉష్ణిక్కు [ఛందో 2-5]

కృష్ణవర్త్మండనియు రూపంబు. 55

కృష్ణవర్త్మండు [శృం. శా. 3-22]

పారదృశ్వాదులకు స్త్రీత్వంబు విభాషనగు. 56

పారదృశ్వ [ఘటికా 2-15; హరి.పూ. 2-223] పారదృశ్వుండు. [తాతంభట్టు, కవిచిం-ఆంధ్రకవితరంగిణి [పూష] [కాశీ 3-92; 185] పూషుండు [భీమ 2-312]

ఉగాగమాంతంబగు జిచ్ఛబ్దంబుమీఁది డుజ్జునకుఁ గొండొకచో లోపంబు గానంబడదు. 57

ఇంద్రజిత్తుఁడు [రామా 8-23] ఇంద్రజిత్తునిన్ (జై. భా. 6-201) ఇంద్రజిత్తుని తల (భా. రా. యుద్ధ 1877) కాలజిత్తుఁడు(జై. భా. 6-163) సత్రాజిత్తుఁడు (హరి.పూ. 3-176) సేనజిత్తుండు (శాంతి 1-191)

జరచ్ఛబ్ది తకారంబునకు లోపంబు గానంబడియెడి. 58

జరుఁడు (వి.పు. 6-173)

పయః సరశ్శబ్దముల సకారంబునకుఁ గొండొకచో లోపంబు చూపట్టెడి. 59

పయము (గాథే 3-60 - సూ.ని.) బిందుసరము (సభా 1-9 ప్రభావ 1-20) బ్రహ్మసరము (అను 2-84) మానససరంబు (ఘటికా 1-3)

ఒకానొకచో మహతీవాచకంబులగు సాంతంబులకంతలోపంబేని, ద్వితీయైకవచనాంత తుల్యత్వంబేనగు. 60

అప్సరల్ (భీమ 5-30) అప్సరస (ఆది 5-195; భీమ 5-41) తపసతేజ (ఆరణ్య 2-259) తపసతేజస.

కృతోత్కంబగు సంస్కృతసమ నామంబు సంబుద్ధిడుజ్జునకును గొన్ని యెడల లోపంబు గానంబడియెడి. 61

జాతవేద ! [ఆది 1-129] ధవవంత ! [బసవ 359 పు] మాల్యవంత [భా. రా. ఆరణ్య 2-115] నయవంతా! [భాగ 7 స్కం 481 పు] సుధన్వ ! [జై.భా. 4-123; 139] శతధన్వ [వి. పు. 6-293]

అపాణినీయంబులు మీననేత్రీ ప్రభృతు లన్యవ్యాకరణ సిద్ధంబులు గ్రాహ్యంబులు. 62

అంబుజనేత్రి (బసవ 16పు) వనజనేత్రి (కు. సం. 4-70) గీష్పతి(శృ. నై 4-28)ఫణినాథుత్యయము (శృ. నై. 8-19) ఫణినసూనుఁడు (మను 1-12) వృద్ధాంధ్యము. (బసవ 7 పు; భీమ 1-105; హ.న. 2-6; కళా8-215 మొ॥) మూస్త్రామూష్టి (ఆరణ్య 3-395; కాశీ 5-150; హర. 7-87; జై. భా. 8-6) విశ్రామము (రాఘవ 1-78, శృ.శా. పీఠిక; అభ్యుర 3-6 కళా అవ 8 ప.) స్త్రైనము (పండితా 291 పు; హర 2-37; రుక్మాం 1-95)

ఇది తత్సమ పరిచ్ఛేదము

## ఆచ్ఛికపరిచ్ఛేదము

ఆచ్ఛికంబులం గొన్నియెడలఁ గ్లీబసమంబులకును బుంలింగతుల్యంబులకును స్త్రీ సమత్వంబు విభాషనగు. 1

అరమరము (శృ.నై 8-75) అరమర (పారిజా 1-94); అరబము (శ్రా 6-86) అరబ (భీమ 3-142); ఏవము (బసవ. 7ఆ: విరాట 1-197) ఏవ (ఆము క్త 1-14; మోసము (కర్ణ 3-3) మోస (అను 2-214; శృ.నై. 7-192) ఒడయఁ (యు) డు (సూ. 6. సూ.) ఒడయ (నీలా 2-13) గొల్లఁడు. గొల్ల (బసవ 225-226 పు) బగతుఁడు, (బసవ 185 పు) బగుతు (పండితా 230 పు- సూ. సూ) ముదుకఁడు (ఉద్యో 4-246) ముదుక (భీమ 1-113) మాలఁడు (శాంతి 3-203; 215) మాల (కాశీ 7-242) ఇత్యాదులు.

ఆచ్ఛికపదంబులు జన్యాజన్యభేదంబున ద్వివిధంబులగు. 2

జన్యంబులనా వ్యుత్పన్నంబులు. అజన్యంబులు నా నవ్యుత్పన్నంబులు. కృత్తద్ధితాంతంబులు జన్యంబులు; తక్కినవి యజన్యంబులు. ఉణాదులకుంబోలె విని వ్యుత్పత్తు లూహ్యంబులు.

తెనుఁగుమఱుఁగులు ప్రయోగ సమ్మతంబులు. 3

అద్భిమేఖలకుదయించినట్టిసీతఁ, జేకొనియె రాఘవుండని చెప్పఁబోటఁ గడలి మొల నూలు చేడియ గనినపడుచు, దెచ్చుకొనె రాముఁడనఁగను దెనుఁగుమఱుఁగు (అప్ప 4-112) చిచ్చుఆకంటిదొర కంటి పేరింటి పేరులు (నీలా 1-60= రుద్రాక్షశాకములు) కడకడ రొయిదయని ముంగై, కడియపు నున్మెత్తఁ బందు గామిడి (అచ్చ, బాల 99 = శేషశాయి. విష్ణువు) వడఁకుఁగుబ్బలి రాచవారి కూరిమి కన్య (కాశీ 4-140) ఇత్యాది.

తిరిప శబ్దంబు మహదర్థకంబు గొండొకచోఁ గ్లీబసిసమంబుగాను గానం బడియెడి. 4

తిరిపము = భిక్షుకుఁడు) కాశీ 7-52; కవిక 5-17) తిరిపమున కిద్దరాండ్రా (శ్రీనా. చాటువు)

కొన్నియెడల సంజ్ఞావాచకంబుల సంబుద్ధి దుజ్జునకు లోపంబు చూపట్టెడి. 5

సిరియాల! (బసవ 284 పు) సిరాలా! (హర 2-118) బసవ! (బసవ 87 పు) సింగా! (శృ. నై 3-1) తిప్పా! (హర. టీక) నరసా! (నరస 3-1)

ఉత్తరపదంబగు రాయశబ్దంబున శిశ్కార్యంబు గానంబడియెడి: కృష్ణరాయ! (ఆము క్త 1-41)

ఒడయ నాయ శబ్దంబుల కుత్వంబు విభాషనగు. 6

ఒడయుఁడు (జై. భా. 5-117) ఒడయుండు (య. 1-32; అచ్చ, రా. బాల 126 ప.); పాండ్యనాయుండు [పండితా. మహిమ 84 పు] నాయఁడ! (సీలా 193) నాయురాలు (క్రీడా 119 ప)

ఆమంత్రణంబునఁ గొన్నియెడల రోశబ్దంబు స్త్రీవాచకేతరంబులకు ననుప్రయుక్తంబగు. 7

బసవరో (బసవ 108 పు) వీరభద్రయ్యరో (బసవ 146పు) అన్నరో (నిరో 2-115) ఏనుంగురో (అచ్చ.రా.) వీరెవ్వరయ్యరో [బసవ 154 పు]

అరగాగమంబుమీఁద గొండొకచోఁ గాన శబ్దంబు గానంబడియెడి. 8

దురాచారులారకాన. (వరాహ 5-52) ఇది సంస్కృతసమంబు మీఁదను గ్రాహ్యంబగనగు. పారిజాతికాన [సారంగ - ప్రా. శబ్ద. 15]

ఏమిలోనగు శబ్దంబులకును గ్రియాపదంబులకును నర్థవిశేషంబులం గొండొకచో రవర్ణం బనుప్రయుక్తంబగు. 9

ఏమిర (ద్రోణ 4-8) దీనికి దీర్ఘంబునుంగలదు; ఏరాతమ్ముఁడ (పాండు 3-33) బళిరా (పాండు 3-67; కళా 1-45) క్రియాపదంబులకు : క్రియా. 8]

అల్ల శబ్దంబు బహువచన లకారంబునకు రేఫంబగుచో దాని ముందు పూర్ణబిందుపూర్వక దకారంబు విభాషనగు. 10

అల్లుండ్రు (కాశీ 7-89; వీర 1-132; కవిక), అల్లురు. (బా. అచ్ఛిక 5)

మింత శబ్దంబు బహువచన లకారంబునకు రేఫంబును, దాని ముందు పూర్ణబిందుపూర్వక డకారంబును వైకల్పికంబుగ నగు. 11

మిండలు (కాశీ 3-1?9), మిండండ్రు (బా. ఆచ్ఛిక 6]

కూఁతుశబ్దంబున కేకత్వంబున రువర్ణంబు ప్రాయికంబుగ నగు. 12

కూఁతురు. కూఁతు పదంబు ప్రాయిక గ్రహణముచే రక్షితంబయ్యె.
కూఁతు (విక్ర., అహో 375 పు; కావ్యాలం 9-111; అం. భా. 2-111)

ప్రథమైక వచనేతరంబులు పరంబులగుచోఁ గూఁతు శబ్దంబునకు గొన్ని యెడల రువర్ణమత్వాంగమంబగు. 13

కూఁతురులు. (భీమ 6-78) కూఁతురిన్. (ఉ.హ 5-215; వసు 3-33; అహో 481 పు) (కూఁతురిక్రమము. (పండితా. పురాతన. 293 పు) కూఁతురిమోవి. (అహో 636 పు) కూతురితో, (యా. 1-42)

పగ శబ్దంబునకు మహద్వాచకంబున కేకత్వంబున అవర్ణంబు గొండొకచో నంతాగమంబగు. 14

మత్తుం, డయిన పగఱ భేదవిధికి నర్హుం డెందున్. (కవిక 2-38.) "పగఱ = పగవాఁడు-చి-ని" (సూ.ని)

మహద్వాచకంబగు పగశబ్దంబు బహువచన లకారంబున కలఘు రేఫంబగు. 15

పగఱలోననొకని (కర్ణ 1-249) పలు పగఱ వలని యాపద (శాంతి 3-243) పగఱకు [కర్ణ 1-252]

ఆల్వాదుల బహువచన లకారంబునకు రేఫంబగుచో ముందటి లువర్ణంబునకుఁ బూర్ణబిందుపూర్వక డువర్ణంబు నగు. 16

ఆండురు (కు. సం. 8-151)

కతిపయ లవర్ణాంత శబ్దంబులకు బహువచనముపరంబగునపుడు తుది యత్తునకులోపంబు గానంబడియెడి. 17

నెలలు ... నెల్లు. (భా. రా. సుందర 204 వ; య 5-37]
మద్దెలలు ... మద్దెల్లు (ప్రభావ 4-98)
ఇట్టివిప్రయోగసిద్ధంబులుసమ్మతంబులు.

కొన్నియెడల బహువచనంబు పరంబగునపుడు రేఫస్థానికంబులగు నలఘు లకారంబుల యుత్వంబునకు లోపంబు విభాషనగు. 18

పేరులు ... పేర్లు (అరణ్య 5-376) నోళ్లులు ... నోళ్లు (రామా 7-261) గోళులు ... గోళ్లు (హర 5-4; మను 3-57; అం. భూ. 77 ప; కావ్యాలం. 9-88)

బహువచనశ్లిష్టంబగు నేలు శబ్దంబు రేఫంబునకుఁ గొండొకచో నలఘు లకారంబు గానంబడియెడి. 19

ఏర్లు ... ఏళ్లు [మార్కం. 3-254]

సమానపదంబునందు సంయోగంబు పరంబగునపుడుగొండొకచో డకారంబున కలఘు ళ కారంబు విభాషనగు. 20

నాళ్లు. [కాలహ 3-35; కళా 5-94] నాండ్లు. [ఆది 1-68]

అనాప విభక్తికంబులం బెండిలి శబ్ద లివర్ణంబునకు బహువచనంబు పరంబగునపుడు పూర్ణబిందుపూర్వక డువర్ణంబు గానంబడియెడి. 21

పెండిలి ... పెండిండ్లు (బసవ. 153పు; అహో 397 పు) పెండ్లి శబ్దంబు నిత్యైక వచనాంతంబు.

కలన్వాదుల నువర్ణంబునకు బహువచనంబు పరంబగుపుడు కుజ్ఞ గొండొకచోఁ గానంబడదు. 22

గవనులు (భీమ 2-52; శృ. శా. 4-177) మసలిమానుల్. (వసు 1-45) నునుమేనులలసి మ్రానులమీఁదనొరగుటల్. (కవిక 4-21)

బహువచనంబు పరంబగునపుడు మీనుశబ్దంబు నువర్ణంబునకు లోపంబు వైకల్పికంబుగ నగు. 23

మీలు, మీనులు (కవిక 4-41; సర్వల-శబ్ద 4 లక్షణము)

మ్రాయిశబ్దంబు నిత్యబహువచనాంతంబు; సమస్తంబగునపుడొకానొకచో నేకవచనాంతంబునగు. 24

తలఁమ్రాలు, ఒడిఁమ్రాలు, సేనఁమ్రాలు; నమ్రాయి (కాశీ 3-121-శ. ర)

రాప్రభృతు లేకాక్షర శబ్దంబులుం గలవు. 25

రానారఁగొన (కు. సం. 8-135) రానారరొలువ (పండితా పురాతన 359 పు) గుంమ్రా (మను 5-17) రాసుతుఁడు (శృ. నై 7-182.) రా =రమ్ము(అచ్చ.రా.అయో

89) పూ (భీమ 2-46; కాశీ 7-148; పారిజా 1-64; మను 3-84) నే (ఉద్యో 2-243; క్రీడా 166; సర్వల. శబ్ద 14) వే (అను 5-326) ఇత్యాదులు.

బహువచనము పరంబగునపుడు ఱాయిశబ్దంబు తుది వ్రాయికి ఉవర్ణంబు విభాషనగు. 26

ఱాలులు, ఱాళ్లు (నాగులేటినీళ్లునాపరాళ్లు-శ్రీనా. చాటువు; అహో 381 పు) పక్షమున- ఱాలు.

ఱాయి శబ్దమునకు ద్వితీయాద్యేకవచనంబులు పరంబగునపుడు తుది యక్షరంబు తివర్ణంబగు. 27

ఱాతికి [ద్రోణ 3-255] ఱాతిపయిని [అను 4-100] ఱాతన్ [ద్రోణ 2-249] ఱాతనున్ [అను 4-294]

ఇయకు మాఱుగా నామమధ్యంబున కొకానొకచో నెత్వంబు గానంబడియెడి. 28

చెల్లియలు, చెల్లెలు [విజయ 3-128] పళ్ళియఱము [ద్వా. 1 భా 2-172] పళ్ళెరము [శృం. నై 6-122; పారిజా 3-38; కాళహ 1-44; వరాహ 4-132]
బహుళగ్రహణముచే "చెలియలు" శబ్దంబున నియకుమాఱుగా నెత్వంబులేదు.

వలయుశబ్దంబు నందయున కెత్వంబాదేశంబు వైకల్పికంబుగ నగు. 29

కావలయు [ఆది 4-177] కావలె [ఉద్యో 3-22] రాలఁగావలెన్ [ఉత్పలమాలిక—బట్టుమూర్తి] జగ్గునిగ్గు నెనగావలె [ఉత్పలమాలిక-పెద్దన]

వాఁడు లోనగునవి పూజ్యార్థకంబులు నగు. 30

వాఁడిట వచ్చువాఁడో యే,నందుల కేగుదాననో, [ఆరణ్య 2-203. వాఁడు=
నలుఁడు. వక్త్రి : దమయంతి] ఈశ్వరుఁ డభవుఁడు వీఁడె వీఁడెసమ్ముఖుఁడయ్యెన్.
[హరి. ఉ. 5-213.] ఇది మునికన్యయేని. [ఆది. 4-30]

కుయొక్కవర్ణకంబులు పరంబగునపుడు యుష్మదర్థక వకారంబునకు లోపంబు కొండొకచోఁ జూపట్టెడు. 31

ఈకు [శివరా 4-63], నీకు, ఈయొక్క, [రాఘవ 3-6], నీయొక్క.

అపదాద్యంబయి యసంయుక్తంబయిన గకారంబు గొన్నియెడల వకారంబు గాదు. 32

తగవు, నగవు-ఇత్యాదులు.

టివర్ణంబు గొండొకచోఁ దదాదులమీఁది నిగాగమంబున కమహత్త్వం బునఁ గానంబడియెడి. 33

వీటిలోపల [అశ్వ 4-453]

అంతాదులమీఁది లడాగమంబున కొకానొకచో టివర్ణంబును ముందటి తకారంబునకు దకారంబునగు. 34

అందటి, కిని దానవబాధఁ దీర్చి కృతకృత్యుండై [శృ. శా. 3-145]

అవగాగమంబు పరంబగునపుడు గులోపంబు విభాషనగు. 35

నాలవతెరువు (శాంతి 2-8) నాలవదినంబు (ఆరణ్య 7-200) నాలవపాలు (ఉ. హ. 2-32) నాలవయుగరాజు (శృ. నై. 7-92) నాలవదివసంబు (జై. భా. 8-92) నాలుగవతీర్థము (భీమ 3-66) నాలుగవజాతి (కాశీ 1-22) నాల్గవగ్రహపదంబు (శృ. శా. 4-27)

ఒకానొకచో నవగాగమంబున కోత్వంబాదేశంబగు. 36

మూఁడోజాము (నిరం 2-102)

ఊరులోనగువానికి నవర్ణంబు పరంబగునపు డిత్వంబుగాదు. 37

ప్రోలున (ఆరణ్య 4-80) పోరున (శల్య 1-121) మన్నున (ఆది 5-231) ఇట్టివి యనాప విభక్తికరూపంబులను నిఘంటువులు ప్రామాదికంబులని యెఱుంగునది.

టివర్ణంబు కొడవలి సేపు శబ్దంబులకు విభాషనగు. 38

ఒలయువైరాగ్యమనుకొడవలినకాని (శాంతి 4-192.) సేపునకు (అశ్వ 2-89; విరా 10-95; శాంతి 4-10) పత్తమున-కొడవటిని, సేపటికి-ఇత్యాది.

ఉత్తరపదంబగు నేకార్థకంబు మీఁది బిందుపూర్వక టివర్ణంబున కొకారంబు పూర్వాగమంబగు. 39

పదునొకొంటికి. (ఉద్యో 4-410) పదునొ, కొంటిలెక్కనఁగనుబొమ్మలువిదకమరు (పాండు 3-198)

పది లోనగుశబ్దంబుల మీఁది బిందుపూర్వక టివర్ణంబున కిడాగమంబు విభాషనగు; నగుచో సంధి వైకల్పికంబునగు. 40

పదియింటిని (అశ్వ 2-153; అను 3- 30) పదియింటన్ (ద్రోణ 3-224; ఉ. హ. 3-74) వాజులిరువ, దింటినూటులు పదునాల్గునిత్తునీకు (కర్ణ 3-149)

Scanned by TapScanner

ఏకాదులు పరంబులగునపుడు నూఱు శబ్దంబు తుది ఱ్ఱాయి టవర్ణ
బగు. 41

నూటయిరువది (ఆది 1-65) నూటయొనిమిది (భీమ 2-66) నూటి
యొనిమిది (నరస 2-50) ఇత్యాదులు.

ఎఁడువర్ణకాంతంబులౌపవిభక్తికంబులగు. 42

బారెంట, మూరెంట, జేనెంట (పండితా 266 పు-నూ. ము ; కాశీ 3-10
పుడి సెంటికి (అహో 270 పు)

తివర్ణంబు పరంబగునపుడు కొఱునుత్వంబున కత్వంబు గొండొక
గానంబడియెడి. 43

కొఱతంబడుంగుకవి (మను 1-9) కొఱఁతవడఁగఁ, గొఱతవేయింతు (నిరం 4-37

కేలు ప్రభృతులు నిత్యైకవచనాంతంబులు గావు. 44

కేలు, తెలుపు, నలుపు. ఇవి కేలు ప్రభృతులు.

మూఁడుకేళ్లు (హరి. ఉ. భా. 8-107) కేళ్లు....నాల్గుందగన్ (ఉ. హ. 6-98
కేళ్లు (ఆముక్త 5-22) ఇరుగేలులు (వి. పు. 3-101) తెలుపులగుచీరలను (విరా
5-315) నలుపులెల్లఁదెలుపులుగఁజేసి (మను 7-27) తెలుపులకును (నృసింహ 1-69)
చిఱునవ్వు తెలుపుల సొంపులు (నృసింహ 1-72)

క్రీడావిశేషవాచకంబులు గొన్ని యేకవచనాంతంబులునగు. 45

కనుమూసిగంత (కళా 6-202) బొమ్మపెండిలి (హర 4-11) పిల్లదీవి, అలం
బిల్లగోడు (కాలహ 3-33)

అహేయంబులు తత్తన్మాండలిక పదంబులు ప్రయోజ్యంబులు 46

కపిల (ఆశ్రమ 1-72) పెండ (అను 3-48; ద్వా 1-92) బేడలు (హ
2-91) సొరకాయ (జై. భా. 4-86) సంతసొరకాయ లుఠోజములు (వె
చాటువు) ఇందుగు (అచ్చ. రా-శ.ర) చిల్లగింజ (వరాహ 8-89) ఇత్యాదులు.

ఇది యాచ్ఛిక పరిచ్ఛేదము

# ముక్తలక్షణకౌముది

## కారకపరిచ్ఛేదము

కర్మప్రవచనీయ యోగంబునఁ గూర్చివిభక్తి వాగనుశాసన సమ్మతంబు. 1

కర్మప్రవచనీయంబనునది యిత్థంభూతాఖ్యాన పరంబు, ఉదాహరణము మీఁద స్పష్టంబగు. (వ్యా. సం. స. 963పు)

కూర్చి పట్టి విభక్తులు పరంబులగునపుడు సుగాగమంబగు. 2

ఆశమీశపుత్త్రిఁ డంబుజసంభవుఁ, గూర్చి భక్తితోడ ఘోరతపము, సేయుచున్న సుప్రసిద్ధుండు (ఆది 2-169) జ్ఞానముఁబట్టి (బా. కారక 14)

ఉపయోగంబునం దాఖ్యాతకుఁ జేత వర్ణకంబునగు. 3

పరశురాముచేత దివ్యాస్త్రంబులు ప్రయోగరహస్యంబులతోడఁ బడసి (ఆది 5-202) ఎవరిచేత విలువిద్య గఱచితని. (ఆది 5-235) అతనిచేత నక్షహృదయమన్ విద్యఁ జేకొనుము. (ఆరణ్య 2-129) బాణప్రయోగోప సం. హరణాద్యా యుద్ధ విద్యలన్నియును ద్రోణాచార్యుచే నభ్యసించిరి. (భాగ 1-127)

చేత వర్ణకంబును హేతువులగు గుణ క్రియలకగు. 4

జ్ఞానముచేతముక్తుండగు, నీవువచ్చుటచేతధన్యుండనయితి.

సహార్థక శబ్దాన్వయంబునందును దోడవర్ణకంబు గానంబడియెడి. 5

గీర్వాణ సంఘంబుతోడఁగూడ నయ్యింద్రునిగొనివచ్చి (ఆరణ్య 7-113) అబ్ధితోఁగూడ మునుగ్రోల నార్వవహ్నిః. (పాండు 1-121) కుంభసంభవుఁడబ్ధితోఁ గూడఁ గ్రోలి (శృ. నై. 2-123)

ఒకానొకచో నుశబ్ద యోగంబులేనప్పుడును దోడకు లోపంబు బహుత్వంబునం గానంబడియెడి. 6

అధికుల హీనులతోడనైనఁ గొఱగాదధిపా. (ఉద్యో 2-46)

క్రోధాదులు దేనికొఱకగు దానికిం జతుర్థియగు. 7

ఇటఁ గుషష్ఠియే తెనుఁగునఁ బ్రాయికంబుగ నగు.

యయాతికి నలిగి. (ఆది 3-98) విప్రులకలిగి (శాంతి 2-172) ఇతనికిఁ గూర్తశని (సభా 2-10) అసూయేర్ష్యా రుచి ద్రోహ శ్లాఘా స్పృహాదు లాదిపద గ్రాహ్యంబులు. ఈషష్ఠిస్థలాంతరంబునందును గానంబడియెడి. నీమఱందికి, నపరాధ శతంబు సైఁపుమయ్య (సభా 2-59)

ఆశీరర్థకంబులయు, నమః ప్రభృతులయు యోగంబునఁ జతుర్థియగు 8

చతుర్థికిమాఱుగ షష్ఠియే తఱచుగఁ జూపట్టెడి. నీకునగు సత్ఫలముల్ (ఆది 1-8) అమరేశ్వరునకు బ్రొక్కి, (ఆది 4-36) అస్మదాదులకెల్లన్, స్వస్తి యొనర్చఁగ. (ఆది 2-219)

కోసము. తదర్థము ననునవి చతుర్థ్యర్థాభిధాయకంబులు. 9

భూసుతకోసమే గనుక బొంకితి నేనియు. (ఉ.రా. 8-86) నీ తదర్థము. (ఆది 2-208)

ఒకానొకచో సప్తమికి వలన వర్ణకంబగు. 10

చిత్తము మెచ్చి నావలనఁ జిక్కెఁగ. (విరాట 2-84) వారిద మార్గంబువలన మహానీల, వైజయంతీ విభవంబు వెలయ (అరణ్య 1-345) అరయం దప్పొక యింత నావలన లేదు. (ఉద్యో 3-358) దానివలనఁ గాంచెఁ గొడుకుల (నిర్వ 2-65) వెలివాడ యోషిత్తువలన సంతతిగాంచె. (శివరా 5-58) ఆ నృసింహవిభుండు తిప్పాంబవలన నాగమాంబికవలన నందనులఁ గాంచె. (మను 1-31)

ఉండిపదంబు గొండొకచో వలనవర్ణకంబులు పెక్కింటి కొక్కటియ యనుప్రయుక్తంబగు. 11

విష్ణుపదమువలన విధునివలన సూర్యు, వలన మేరురూపకలితుఁడైన విష్ణు వలనఁ త్రిపురవిజయి మౌళివలన, నుండి హిమనగమున నొలసెగంగ (ఆను-2-118)

వల్ల కన్నలు పంచమ్యర్థాభిధాయకంబులగు. 12

చలిమలవల్ల నుల్లసిలు చల్లఁదనంబును (మను 2-10) అ. న్నినదము కన్నఁ దిన్ననయి (వసు 2-56) హైహయు కన్నన్ (చమత్కా - అప్పక 3-238) కన్నబిడ్డలకన్న (పాండు 3-68)

పెక్కు శబ్దంబులకొక్క కంటె వర్ణకంబు గొండొకచోఁ గానంబడి యెడి. 13

సూనులతమ్ములకంటె నాకసం, బ్రీతియొనర్చి (ఉద్యో 4-39) సూనులుతమ్ములుం గొనర్చు సంప్రీతికంటె నని యర్థము—(చూ. మీఁదు)

నిర్ధారణంబునఁ గంటెవర్ణకంబు గొన్నియెడల ననుక్తవిషయ గ్రాహకంబగు. 14

కొడుకుల కంటె నయ్యనుఁగుఁగోడలి కెక్కుడుగూర్తు (ఉద్యో, 3-186 కొడుకులకంటెన్ =కొడుకులకుఁగూర్చు కంటెనని యర్థము.) ఉండు నప్రాణులం దొక్కించుకా శక్తి, స్థావరశ్రేణిఁ దజ్జాతికంటె. (ఆముక్త 3-80 తజ్జాతికంటెన్ = తజ్జాతియందుండు శక్తికంటె నని యర్థము. అప్రాణులందుండు శక్తికంటె నని భావము) అమర గంగానదీ ప్రవాహంబుకంటె, ధరణీధర రాజు నీచరిత్రంబుకతనఁ, బరమపావనుఁడయ్యెనోపద్మనయన. (హర. 4-21 అమరగంగానదీప్రవాహంబు కంటెన్ =అమరగంగానదీ ప్రవాహంబు కతనఁ బరమపావనుఁడైన దానికంటె) కన్న బిడ్డలకన్న గారవంబునఁ జన, విచ్చెఁగా నిచ్చలు నింటిలోన (పాండు 3-68. కన్న బిడ్డలకన్నన్ =కన్నబిడ్డలకిచ్చుచనవుకన్న.)

కువర్ణకంబును గొండొకచో నిర్ధారణ పంచమికగు. 15

విత్తరక్షకుఁ గడుమేలు వృత్తరక్ష. (ఆరణ్య 4-130) ఎల్లవారికి నత్యున్నతుండవు. (ఆరణ్య 2-238) ఈ, త్రిలోకముల కధికుఁ జూచితిమి యొకయొఱుకన్ (ఆది 2-265) వానికెల్లను బెద్ద మనసు. (శాంతి 4-196) సాధ్యులకు దేవతలకుఁ బ్రజాపతులకుశాశ్వతుండితండయని. (ఉ. హ. 6-14)

కువర్ణకంబుం గొన్నియెడల నిర్ధారణ షష్ఠికగు. 16

ఛందములకు గాయత్రి యగ్గలము పశువులకు మేటి యజ,మఖిలచతుష్పదులకు ధేనువుమిక్కిలి, మానవులకు బ్రాహ్మణుండు వరిష్ఠుండు. (అశ్వ 2-161) ఇతఁడువో కురుసేనకుమేటి. (ద్రోణ 2-65) అంబురాశి నదంబుల, కచలములకు నాహిమాద్రి, పక్షులకుఁ గశ్యపసుతుండు, మేటిరైయొప్పుక్రియ (హరి. పూ. 7-206) వాఁడెపో నృప నికాయము కెల్లను మేటి. (భోజరా 2 ఆ)

కువర్ణకంబు దూరాంతిక శబ్దార్థయోగంబునందగు. 17

మాకు సమీపస్థుండవ. (సభా. 2-82)

విగ్రహ వాక్యంబులందును, బ్రతిపదార్థ నిరూపణంబునందును యొక్క వర్ణకంబు వాడంబడు. 18

రాముని బాణములు = రామునియొక్క బాణములు. హారుద్రయునుట దానో రుద్రయునుట. వారక మఱియుం దవ్రపణతావ, నంగఁ బూర్వార్థమునంగ నీయొక్క, సంగతి లింగ పూజా వేళలందు (పండితా. దీక్షా. 89 పు)

దివిదువర్ణకంబులు గొండొకచో యొక్కార్థకంబులగు. 19

తనదైన దివ్యదీప్తి (ఆరణ్య 1-348) నీదైనప్రౌఢిమహిమభానుకులుఁడ (రాఘవ 1-30) వారివధమిమ్మల్ల (ఆది 3-156) అనఘ నిద్రించితది మొదలైన నీదు. (ఆను ౭-329) చరితంబద్భుతము (ఆను ౭-330)

ఉదంత జడంబు తృతీయకందు వర్ణకంబును గొండొకచోఁ జూపట్టెడి. 20

కడఁగి బుద్ధిబలంబునంద యకంటకంబుగఁ జేసి. (ఆరణ్య 6-32) గుర్వాజ్ఞయును కత్తి కుంతంబునందుఁ బూర్వాశ్రమంబను పులిఁ బడఁబొడిచి. (బసవ 396 పు) పుష్కరాగ్రంబునం దాటోపంబొనరించు. (కు. సం. 1-100) ఆ గిరీంద్రసుత ... స్వాగతాభిమత వాక్యములం, దభ్యాగతోచిత సపర్యలఁ దన్పెన్. (కు.సం. 7-56) తెగితిమి శిలీముఖములందు. (భా. రా. అయోధ్యా 181 వ)

కొండొకచోఁ బొందు ధాతు యోగంబున ద్వితీయకు నవర్ణకంబగు. 21

రాగంబునంబొంద (ఆది 4-190) దైన్యాతిరేకం, బునంబొందు. (స్త్రీ 188ప) ఆనందంబునఁ బొందు మిందునిభ వక్త్రా! (శృ. నై. 5-61)

అధ్వంబులకొకానొకచో ద్వితీయా సప్తములునగు. 22

అర్ధమరేయిఁబోయిరి శివా యనిపల్కుచు రెండరామడన్. (కాలహ 4-55) రెండామడఁ గల్గి నొక్క భయదాటవిలోన. (జై. భా. 8-64)

ఉండి ప్రభృతుల యోగంబున సప్తమ్యాదులగు. 23

దేవపథంబునందుండి. (ఆరణ్య 3-80) బ్రహ్మలోకంబుననుండి. (ఆది 3-91) ఏచోటనుండి. (కళా 6-48) నలువనుండి వచ్చిన రాజకులము నెల్ల. (మార్కం 7-69) నాటియున్నది మఱి చిన్ననాఁటినుండి (విజయ 2-194) త్రిదశేంద్రుఁ దొట్టి (ఆది 4-37) హిమకరుఁదొట్టి. (ఆది 1-14) నిన్నటఁగోల

(ఆది 8–118) గోగ్రహణంబునఁ గోలె. (ఉద్యో 3–92) కాంచియామ్మంత్రియు చోటనుంచి వచ్చె (కృష్ణరా. (4–26)

కోలె లోనగు శబ్దంబులు గొండొకచో సవర్ణకాంత ధాతుజవిశేషణంబునకుఁ బ్రభృత్యర్థంబునందగు. 24

పతి జనించినకోలెను బరహితైక, లోలమతి. (నిర్వ 9-32) ఇట సవర్ణకాంతంబునకుఁ దచ్ఛబ్ద మనుప్రయుక్తంబునగు: ఆతఁ డుదయించినది మొదల్ [లంకా 1–5]

సహితాదులయోగంబునఁదృతీయాది విభక్తులగు. 25

నీతో సైతము, నన్నుసయితము, నాకుసయితము-ఇత్యాది. (అహో 423 పు)

ఒకానొకచో సప్తమిమీఁది యుండికి వ్యవహితత్వంబు చూపట్టెడి. 26

ఏరాతమ్ముఁడ నన్నుఁజూడఁ జనుదేవెన్నాళ్లనో యుండి. (పాండు 3-33)

అందు మీఁది యుండికిని గొన్నియెడల లోపంబు గానంబడియెడి 27

తన్ముఖ నాసికా, ద్వారములందు వెల్వడియె దారుణ వహ్ని శిఖా కలాపముల్ (ఆరణ్య 4–410) నాయందధికధనంబు గొనిపొమ్ము. (ఆది 2-193) ముఖనేత్ర నాసికా రంధ్రములం, దనవరత రోష పావక, జనిత శిఖా వితతు లక్కజంబుగ వెడలెన్. (ఆరణ్య 6-316)

కొండొకచో గమ్యమాన క్రియయుఁ గారక విభక్తినిమిత్తకంబగు. 28

పలుకులచే నేమి వికచపంకజవదనా! (అహో. 508 పు. ఏమి = ఏమివచ్చును. వచ్చునను క్రియ గమ్యమగుచుండుటచే నిటఁ జేత వర్ణకము కలిగినది.)

పూజ్యార్థక బహువచనంబుల విశేషణక్రియల కేకవచనంబు గొన్నియెడలఁ గానంబడియెడి. 29

త్రయ్యంతవాసనా శయ్యాగృహద్బుద్ధి, యొయ్యారి రామానుజయ్యగారు. (పాండు 1-42) ఏము సంకృతి పూతిమాష మాధవుని కుమారవరుఁడ.. (క్రీడా. 189 ప) మీరు మాయింటికివచ్చి....నిద్రించితి. ఆను (2–329) పెట్టె దొడ్డగ నామెత ప్రెగడగారు. (శివరా 2-55) ఒజ్జలు వైపై నెనయింపసాగె. (వసు 3–100) ఏము మది సందియమొక్కటి విన్నవించెదన్. (నిరం 1-35)

మహాత్ములగు స్త్రీక్లీబంబుల విశేషణ క్రియలు మహత్పులింగంబులకుం బోలెనగు. 30

దేవతలంధర్మవర్తులు (ఆరణ్య 2-313) దేవతలు...ఆసన్నులై నిలిచిరి. (ఆరణ్య

2-55) ఇతండే దైవంబని. (హ. స. అవ. 22 ప.) "సరిసేతునుండు భావనారాయణ స్వామి, దప్పించి పెఱదైవతంబులేదు" (భీమ. 2-66) అనుచో దైవతశబ్దంబు దేవతా సమూహవాచకంబనియెఱుంగునది.

కొన్నియెడల సమహత్తుల విశేషణాదులకు మహత్కార్యంబులు చూపట్టెడి. 31

పిల్లి యిట్టులనియె నింక, నేమి సేయువాఁడ. (శాంతి 3-220) ఈ దుష్టులాఁ బోతుల్. (హరి. పూ. 6-152)

అమహత్తులు మహత్కార్యయుక్తంబులయ్యెఁ దద్విశేషణాదు లమహత్కార్యయోగ్యంబులు విభాషనగు. 32

అర్చితంబైనయీయశ్వరాజును. (ఆరణ్య 3-63) ఆసారమేయము నడచిన నది యఱచుచుం బఱతెంచి. (ఆది 1-83) నాగులెల్లను గవిసి పాదివి, కఱచుచున్నవి. (హరి. పూ. 7-28)

మహదారోపణంబున సమహత్తుల విశేషణక్రియలు మహత్కార్యంబులు వడయు. 33

ఇట మహచ్ఛబ్దంబు మహతీవాచకంబున కుపలక్షణంబు. లతా లలనల్...సేసలు వెట్టిన యట్టులైరి. (ఆది 4-17)

అమహదారోపణంబున మహత్తుల విశేషణక్రియ లమహత్కార్యయోగ్యంబులు విభాషనగు. 34

నీయనుజసాగరముల్ ..సర్వజగంబుల నాక్రమింపవే. (ఆరణ్య 4-156) ధూ
తరాభ్రవిభ్రమముఁ బుష్కర రమ్యకరంబు దానల,క్ష్మీ రుచిరంబు, సత్వగుణ కీర్తి
మూర్తియు వాలిసాల సం,హార విహార కారణమునా రఘుకుంజర భర్తమున్న సం,చార
మొనర్చె నీ యచలసాను తలంబున నంబుజాననా! (పాండు 1-135)

మహతీ వాచకంబులగు స్త్రీలింగంబుల విశేషణంబులకును గ్లీబత్వంబు గొండొకచోఁ గానంబడియెడి. 35

కొడుకులం లేమికిఁ గడు దుఃఖియగుచు. (బసవ 48 పు. మాదాంబ-కర్త) భవి యపూర్వలాంఛనధారి గాఁగ. (బసవ 137 పు)

ఆచ్ఛికంబుల న్మహద్వాచకంబులయు మహతీవాచకంబులయుఁ దిర్యగ్జడంబులయు విశేషణంబులు సొరిదిని పుంస్త్రీనపుంసక లింగంబు లగు. 36

మహత్తులకు: అతఁడు పాణిగ్రహణార్హుండు. (శృ. నై. 2-66) మహతికి: ఉన్మత్తవేషిణి యైన లచ్చి. (ఆరణ్య 2-115) జడములకు: ధరాపరాగ పటలాక్రాంతంబు మిన్నేఱు. (రాఘవ 1-9) ఇట్లే తిర్యక్కులకు.

ఏకాంతంబగు సంఖ్యా ప్రయుక్త విశేషణంబుమీఁది విశేష్యంబున కేక వచనంబు విభాషనగు. 37

ఇరువదియొక్క దినములు. (అను 2-329) ఇరువదియొక్క దినము. (బసవ 288 పు.)

తచ్ఛబ్దాంతంబులగు ధాతుజవిశేషణంబుల మీఁదను నరు గానంబడి యెడి. 38

ధరయేలింపఁగనున్నారరు మీకుం దగునెసంగరములోఁ గలఁగన్. (ద్రోణ 5-111 సర్వల. సంధి 46) జననమునొందినారరు. (ఆరణ్య 4-228)

ఇది కారకపరిచ్ఛేదము

## సమాసపరిచ్ఛేదము

**ఏకదేశాన్వయంబు వ్యధికరణంబునం దగు. 1**

అవనీశులెల్ల నీయనుజవీర్య విజితులు. (సభా. 1-272) అతని కరతలద్వయావమర్దితములై. (ఆరణ్య 2-197) నావీర్యప్రభువులు. (ఆది 8-30) తన యశో విశద ముక్తాసౌధపాళికి (వసు 1-116 రాకసుధాంశుమండలము (శృ.నై. 2-137) తమస తీర సికతా విలసనములు (రాఘవ 1-18)

ఇయ్యది సమానాధికరణంబునందును గొన్నియెడలఁ గానంబడియెడి. ఆనారాయణ పాండవేయ గుణ మాహాత్మ్యమలజ్యోత్స్న. (ఆది 3-21) ఆరథాదిరూఢుండు. (ఆరణ్య 2-183) ఆ పర్వతాగ్ర హేమైక శృంగంబునా (కు.సం. 1-2) మల్లోకవంద్య (బసవ 58 పు)

**శ్రేష్ఠతా వాచకంబులగు నార్యాద్యర్థక శబ్దంబుల మీఁద నార్యాద్యర్థక శబ్దంబులు బహుళంబుగ నగు. 2**

ఎఱ్ఱినార్య (హరి. పీఠిక), ఎఱ్ఱన; వేమనయ్య, (పండితా 192 పు.) వేమన, నన్ని శబ్దంబున కికారాకారంబు నిత్యంబు: నన్నపార్య (ఆది 1-9) నన్ననార్య (విక్రమా 1-38)

**అంబాశబ్దం బనుప్రయుక్తమగుచో శ్రేష్ఠతా వాచకంబను శబ్దమునకు లోపంబు విభాషనగు. 3**

అన్నమాంబ. (విరాట 1-10), అన్నాంబ; అక్కమాంబ (విక్రమా 1-47) అక్కాంబ: తిమ్మమాంబ (పాండు 1-55) తిమ్మాంబ; నాగమాంబిక (పాండు 1-58; మను 1-31) నాగాంబిక; నాగాంబ. (మను 5-106) గంగమాంబ (పాండు 1-39) గంగాంబ (బసవ 129 పు.) అంబా శబ్దంబను ప్రయుక్తము కానిచో నన్నమాది రూపంబులు గలుగునని యెఱుంగునది. అంబమకును (పాండు 1-42) ఒకానొకచో నవ్వ శబ్దంబు పరంబగునపుడకశబ్దంబునకు లోపంబు పాక్షికంబుగఁ జూపట్టెడు. వైజవ్వ (బసవ 450 పు) వైజకవ్వ (పండితా. మహిమ 93 పు)

**శ్రేష్ఠతావాచకం బన్న శబ్దం బొకానొకచో స్త్ర్యర్థంబునందగు. 4**

అమ్మన, (పాండు 1-60 గా. పా. ద్విప్రాసము)

**బిరుదాదులయందు వర్ణకల్పనంబు యథా ప్రయోగంబుగ గ్రాహ్యం బగు. 5**

గ్రామమనుష్య నామంబులు, కులవాచకంబులు, మతపారిభాషిక పదంబులు, తదితర సంజ్ఞలు లోనగునవి యాది పద గ్రాహ్యంబులు.

రాజా నారాయణాఖ్య (ఆది 2 237) శృంగారంకోట. (కాశీ 1-52) రేపల్లె (అహో 492 పు; భాగ 10. ఉ. 479 ప) కోనేటి చిన్నతిమ్మ నృప కుంజరు. (రామా. పీఠిక 41) సిరంగరాయ (వసు 1-71) పాండురంగండు (పాండు 2-3) మాచల్దేవి (క్రీడా 180) తిరుమల్దేవి (ఆముక్త 1-33) విరురి (పాండు 1-20) కంసాల (భోజ. 5-3?2) అంసాలంబిత ... కంసాల వధూటి యెదుటం గానంగనయ్యెన్. (చాటువు) నంది తింమకవి. (పారిజా. 5-97 చక్ర బంధము) శాంక రీశ్వరుండునాతింమాఖ్య నెనయుతాత. (లంకా 2-213. తింమాఖ్య; నాతిన్ + మాఖ్య)

**బిరుదాదులు సంస్కృత శబ్దానుకరణంబున సిద్ధసమాస ఘటితంబు లగు 6**

త్రిభువన పెండేరు (నిర్వ 2-102) త్రిభువనీరాయపెండేరుండు (దశ 1-16) పేషణహనుమంతబిరుదాంకులు (శృ.నై. 1-32) అరిరాయవేశ్యాభుజంగుండు (నిర్వ 1-44) రాయవేశ్యాభుజంగ (భీమ 1-38 తిర్మలమహారాయ క్షమావల్లభున్ (వసు 1-3) రాయసప్రవృత్తి (పాండు 1-20) సౌగతాగమమాలిమిశాస్త్రసరణి (పాండు 2-66) నానావజీర సేనామానభేదనుండును (వసు 1-14) ఏదులఖానోగ్రకపాలము (ఆముక్త 1-42) గరుడపచ్చ (శృ.నై. 6-1?4) ఉత్తర జందెము (శివరా 2-64; కాలహ 4-159) కంథకట్లు (బసవ. 134 పు) అంగదట్టము (మను 2-27) ధర్మ దార (బసవ 5?7 పు: క్రీడా 54 ప) శివమరుక్ (బసవ 107 పు) వీరభద్రపళ్ళెరము (ఆముక్త 4-43) అన్నరసమాజవరునకు (లంకా 2-76. అన్నర + సమాజ వరునకు. (అన్నరసమా + జ + వరునకు = నరసమ్మ పుత్రులలో జ్యేష్ఠునకు)

**వీరభక్తశబ్దంబులు బిరుదవాచకంబు లవికృతాంతంబులయి యాచ్ఛికం బులతోడ మిశ్రకర్మధారయంబులగు. 7**

వీరయాదయ్య (బసవ. 146 పు.) వీరయాబలుండు (జై. భా. 1-30) వీరసం బెట (క్రీడా 117, 120 ప) భక్తబండారి (బసవ 75 పు)

సిద్ధసమాసంబున బిరుదవాచకంబులకౌపవిభక్తికాదివికారంబులు బహుళంబుగనగు. 8

కొండవీటిమండలా (మను3-144) "మానూరిపట్టణవరేమహితో స్త్రియుక్కామాగల్లు పట్టణమహేశమహాంభజామి" బహుళగ్రహణముచే — కసువరాజవంశజలధి కౌస్తుభోదయాంచితా. (అహో 492 పు.) అనుచో "కసువరాజు" — అనియుత్వంబుగాదు.

బిరుదవాచకంబుల తుదియత్వంబునకు వైకల్పికంబుగ, నిత్యంబుగ, సిద్ధసమాసంబున దీర్ఘంబగు. 9

ఇత్వంబునకు: కొండవీటీమండలకటకేశ (పారిజా 4-93) ఆకువీ,టీతిమ్మప్రభు (రాఘువ 1-1) కందుకూరీపురాంతరసీమంబున (వరాహ 1-31. హ్రస్వమునకు. చూ 10 సూ.) అత్వంబునకు : లక్ష్మమావరతనయా (పాండు 1-24) గంగమాప్రాణ విభుఁడు (పాండు 1-38) గంగమాహృదయనారజ నీరజబాంధవాకృతిన్. (సుదక్షి 1-29). రామమా, రామయసోమమంత్రి (సుదక్షి 1-6) రాజమాధవునకు (లంకా 1-12; రాజమా + ధవునకు; రాజ + మాధవునకు) ధృతమతితోనరసాసంతతితో (లంకా 2-54. ధృతమతితో + నరసా + సంతతితో; ధృతమతితోన + రసా + సంతతితో)

బిరుదాదులకు సాంస్కృతిక స్వరంబు పరంబగుచో సంస్కృత సంధి కార్యంబులగు. 10

తిర్మల మహారాయోక్తి (వసు 1-4) ఏదులఖానోగ్ర కపాలము (ఆముక్త 1-42) శ్రీతెనాల్యగ్రహార నిర్ణేతవు. (పాండు 1-23) మానూర్యన్వయవర్ధనా. (అహో (492 పు)

ఒకానొకచో సిద్ధసమాసంబున బిరుదాదుల మువర్ణకంబునకు లోపంబు చూపట్టదు. 11

శ్రీ మద్బల్లముకొండ భైరవ కృపా శ్రీ నిత్య సామ్రాజ్య ల, క్ష్మీ మాధుర్య (విక్రమా 2-260) గుత్తిమువంశ పావనుఁడు. (అహో 492 పు)

సిద్ధసమాసంబున బిరుదాదుల హ్రస్వవక్రంబులకు దీర్ఘంబు గలగదు. 12

శ్రీ తెనాల్యగ్రహార నిర్ణేతవు (పాండు 1-23) శ్రీమద్బల్లము కొండ భైరవ పాళ్య. (విక్ర 2-260) శేపల్లెవాడ నగరీ (అహో 492 పు)

బిరుదవాచకంబులుగొన్ని భాషాంతర శబ్దఘటితంబులుగఁ గానంబడి యెడి. 13

తలగొండు గండబిరుద శోభితుఁడు. (పద్య. బసవ. పీఠిక.) జగనొబ్బ గండ బిరుద. (శృం. నై. 1-37; భీమ 1-29) మూరురాయరగండ (మను 1-12) వసు 2-1) ఇత్యాదులు.

కర్మధారయంబు మిశ్రంబు గొన్నియెడల ముగంతేతర సంస్కృతసమ పూర్వపదంబునయియుండు. 14

రూఢిమాట [విరాట 2-204) భూరివాన (నిర్వ 1-65) మూలదుంప (భీమ 5-157) ఆదిబోడ (కు.సం. 12-218) ఆదికుమ్మరి (బసవ 237 పు.) ధూర్తజరభి (క్రీడా 268 పు)

మిశ్రంబులు ప్రాదికర్మధారయంబులు యథాప్రయోగంబుగ గ్రాహ్యం బులగు. 15

అపపాడి (మార్కం 8-113) అవపాడి (దశ 11-116) అవత్రావుడు (పాండు 3-19) ప్రతిజోడు (విజయ 1-93) ఇత్యాది.

త్రికంబుమీఁది సంయుక్తహల్లునకును గొండొకచో ద్విత్వంబు చూప ట్టెడు. 16

నీవిప్రప్రభావము (రాఘవ 2-107. నీవు, ఈ + ప్రభావము; నీ + విప్రభావము) అప్రొద్దు (నృసింహ 3-2)

ఒకానొకచోఁ గృతహ్రస్వంబగు త్రికంబు మీఁది జడ్డకు లోపంబు గానం బడియెడి. 17

అకళంకిసహజకళాధివసతి. (హ.న.అవ. అక్కళంకి = అకళంకి; నఞ్ + కళంకి) అయాలాపంబయి వేళఁబల్కెడు. (మను 3-57. ఇవ్వేళ = ఇవేళ) అనుచునక్షత్ర కులసిత; (హ. న. అనుచున్ + అక్షత్రకుల + సిత; అనుచున్ + నక్షత్రకు + లసిత. అ + క్షత్రకుల = అక్ క్షత్రకుల. జడ్డలోపము: అక్షత్రకుల) అప్రమద (హ.న. 1-30. అ + ప్రమద = అప్ప్రమద; అప్రమద. నఞ్ + ప్రమద)

త్రికంబుమీఁది వర్గద్వితీయ చతుర్థంబులకు ద్విరుక్తంబులకుఁ దత్
ద్వర్గ ప్రథమ తృతీయంబులగు. 18

ఇద్దరణీశులలో గుణ, వృద్ధని (సభా. 2-27)

కర్మధారయంబు త్రికేతరసర్వనామ పూర్వపదంబునొకానొకచో మహద్వి
శేష్యకంబగు. 19

కొన్ని వేలువలు (బసవ 261 పు) పెక్కు సఖులకు (శృ. శా. 3-178)

చక్కాద్ధులకుఁ గర్మధారయంబునందు నిగాగమంబు నిత్యంబుగ
నగు. 20

చక్కని గుజ్జిము, చక్కనిచాయ, చక్కనివాఁడు (అహో 416 పు) వ్రేఁకి
భల్లమున (ద్రోణ 1-20) వ్రేఁకని చన్నులు (కాశీ 7-159) వ్రేఁకని శూలము
(నృసింహ 4-133) పలుచనిరొంపి (విరాట 2-134) ప్రన్నని తొడవులు (శ్రీ
2-17) చిక్కని చనుఁగవ (ఆది 3-38) చక్కని చిక్కని మేనులు (విరాట
1-156)

ఒకానొకచోఁ గర్మధారయంబునం దుత్తరపదంబు పరంబగునపు డవ
గాగమంబునకు లోపంబు విభాషనగు. 21

ముక్కన్ను (బసవ 102 పు; పండితా 201 పు; వీర 2-128) మూఁడవ
కన్ను; పదియార్వన్నె (శృ. నై. 6-53) పదియాఱవవన్నె (నీలా 2-30)

గానంబడి
కొండొకచో నుపమితరూపకంబులు మిశ్రంబులుగాను
యెడి. 22

కులుబోడముండరత్నము (క్రీడా 168 ప) రుషముచ్చిచ్చు (ఆముక్త 3-28)
తొలిదిక్కుజవరాలు (మను 5-40)

ఒకానొకచో ద్విగువునఁ బదిశబ్దంబునకుత్తరపదంబునకుఁ బై యగు. 23

ఇరువై (కాశీ 1-53; వరాహ 11-106; నరస 2-50) అలువై (వరాహ
10-137)

ఉత్తరపదంబు పరంబగునపు డొకకుమాఱుగా నోశబ్దంబు గొండొకచోఁ గానంబడియెడి. 24

ఓరాత్రిం గను ఱెప్పవేయక (కాశీ 5-189)

ద్విగువు మహదర్థఘటితంబు నొకానొకచో దృష్టంబగు. 25

మువ్వేలంపులయొక్క (అచ్చ.రా. బాల 18 ప) రెండున్నరమానిసి (ప్రౌఢ. శబ్ద4)

ఏకదేశి సమాసంబులుం గొన్ని యెడల గానంబడియెడి. 26

ఇవి ప్రథమాతత్పురుషంబులనియు వ్యవహరింపంబడు.

అఱగన్ను, క్రేఁగన్ను, క్రేకన్ను. (బసవ 197 పు; ఉ. నా. 3-133) సామేను (శృ. నై. 4-129) కొనచేయి, పెడతల (పాండు 3-81) ఇత్యాదులు. (అహో 531 పు)

యుష్మదస్మదాత్మార్థకంబులకుత్తర పదంబు పరంబగునపుడు బహుత్వంబు నందును గొన్నియెడల దుగాగమంబు గానంబడియెడి. 27

మాదుదేహంబు (బసవ 308 పు.) తమదు రాచరికంబుల్ (హరి. పూ. 2-72) మీఁదువిమర్శల్ (భోజ 5-302) మనదు రాక (శృ. శా. 2-9)

కొన్నియెడల షష్ఠీసమాసంబునఁ బూర్వ పదంబు జాత్యేకవచనంబు బహుళంబుగా నగు. 28

ననదండ [ఆముక్త 1-14] ననలదండ; పువ్విలుకాఁడు [ఉ. రా. 4-196). పువ్వుల విలుకాఁడు (ఉ. హ. 2-195) ఆఁబోతు (కాశీ 2-104) ఆలపోతు (ఉ.హ 2-180) బంధువరుస. [భాగ 10 స్క. ఉ. 573 ప] బంధువరుస.

అలరుఁబోఁడీత్యాదులు బహువ్రీహులు. 29

ఇయ్యవి యుపమాన పూర్వపదకర్మధారయంబులనుట యస్వరసంబగుటంజేసి యనాదరణీయంబని తెలియంగునది.

అలరుఁబోఁడి = అలరువంటిపోఁడి దేనికిఁగలదో యది. ఆరతిఁబోఁడి (శృ.శా. 3-75) = ఆరతి వంటిపోఁడి దేనికిఁగలదో యది. తీయంబోఁడి (పాంచా. ప్రౌఢ. సమాస 19) తీయనైనపోఁడి దేనికిఁగలదోయది. మధురాకృతియనుట. (పోఁడి = ఆకృతి, రూపము, ఒప్పిదము.) బంగారుఁబోఁడి = (పరమ) బంగారువంటిపోఁడి దేనికిఁగల దోయది. ఇత్యాదులెఱుంగునది.

స్త్రీసమేతర ఘటితంబు నొకానొకండు బహువ్రీహి చూపట్టెడు. 30

మచ్చుకంటి (శృ. నై. 6-135; కళా 3-139; ఉ. రా. 7-385; అం-భూ. 116 ప) నెలత్రావడము = చకోరము. (హ.న. 4-43)

మిశ్రబహువ్రీహి నిపాతన్యాయంబున గ్రాహ్యంబగు. 31

కలుకంతుఁడు (ఆరణ్య 5-332 మొ॥ ఈవిండ్లుగుఱ్ఱంచబలఁతిబలంబుల్ (విరాట 4-105) ఆనందపురూపుని విష్ణుని. (శాంతి 2-30) చిక్కనిమనసులంగుమారసింహులు (ఆరణ్య 5-332) కొఱప్రాణులైనవీరులు (కు. సం. 11-125) ఒక్కనేత్రుఁడయ్యె (భాగ. 8-607) అలరుసాయకవైరి (వీర 2-229) మొల్లసుగంధి (వి. పు. 2-233 కప్పురగంధులు (పారిజా 3-11) చనుపకగంధి (వీర 1-114) దర్భపోటు (ఆముక్త 7-5 దర్భయొక్క పోటులుగలది = శ్రాద్ధభోజనము)

షష్ఠీతత్పురుషంబులు గొన్నియెడల నాభాసబహువ్రీహులునాఁబడు. 32

దివ్యతేజంబునవాఁడు (ఆది 6-57) కేతనోజ్జ్వలవిభ్రమమువాఁడు. కేతుప్రేంఖణమువాఁడు, ధ్వజసముల్లాసంబువాఁడు, పతాకావిహారంబువాఁడు, పడగవాఁడు సిడమువాఁడు (విరాట 5-5) వేయినామములవాడు, వేయిగన్నులవాఁడు, వేయిచేతులవాఁడు వేనామములవాఁడు (విక్రమా 6-1) మూఁడుకన్నులవేల్పు. వేయికన్నులవేల్పు (శృ.నై. 4-23)

వ్యధికరణ బహువ్రీహులు ప్రయోగసిద్ధంబులు గ్రాహ్యంబులు 33

నెలత్రావడము = నెలను ద్రావడము దేనికిఁగలదోయది – చకోరము. (హ.న. 4-43) నెత్తురుఁద్రావుడు = నెత్తురును ద్రావుడు వేనికిఁగలదోవాఁడు - అసపుఁడు రాక్షసుఁడు (అచ్చ. రా.యు. 60,196 ప) కడలిరామాలి = కడలిరాచవలని చూలు (పూతి, జననము) దేనికిఁగలదోయది - లక్ష్మి. ఇట్లుకొండరామాలి. పుట్టచేరుప్ప = పుట్టయొక్క చేర్పు దేనికిఁగలదోయది-పాము. (హ.న. 4-43) దర్భపోటు = దర్భయొక్క పోటు దేనికిఁ గలదోయది – శ్రాద్ధభోజనము (ఆముక్త 7-5) వాకతాల్పుడు = వాకయొక్క తాల్పుడువేనికిఁ గలదో వాఁడు – శివుఁడు (పాండు 1-199) పుట్టఁబుట్టువు = పుట్టయందుఁ బుట్టువు వేనికిఁ గలదోవాఁడు – వాల్మీకి (హ.న. అవ 19; విక్రమా 1-9) అబ్బఁ బుట్టువు = అబ్బునందుఁ బుట్టువు దేనికిఁ గలదోయది - పద్మము (హ.న. 4-43) కవ్వడి = కలయందు వడివేనికిఁగలదోవాఁడు - సవ్యసాచి, అర్జునుఁడు.

ద్వంద్వంబునఁ గొండొకచో ఋకారంబున కానజాదేశ భిన్నస్థలంబునందును రపర్ణంబు విభాషనగు. 34

మాం, ధాత్రరఘుక్షితీశులం. (ఆది 2-175). మాంధాతృరఘుక్షితీశులం.

ఊర్ధ్వంద్వేరః (ఆం. చిం.) అను సూత్రంబున కిది విరుద్ధంబని గ్రహింపవలయును..

**కొన్నియెడల మిశ్రద్వంద్వంబునఁ బూర్వపదంబు ముపర్ణకేతరంబుగాను గానంబడియెడి. 35**

విభూతివీడ్యములు (బసవ 38 పు; 65పు.) ప్రస్తుతిదీవెనల్ (బసవ 66 పు) దేవిదేవరలఁబోలె (శృ. నై. 2-86) భానుచందురులను (భాగ 8-323) చదువు సంధ్యలు (పాండు 2-55)

**కొన్నియెడల వర్ణంబులు ద్వంద్వసమాస ఘటితంబులగు, నగుచోఁ దుదివర్ణంబు స్త్రీసమంబేని క్లీబసమంబే నగు. 36**

కచటతపలనఁగఁబరఁగిన (కవిజ) వలస్రీనచోలళములుడళ, మూలు (కవిజ)

**మధ్యమపదలోపి సమాసంబులు యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులగు. 37**

పూవురెమ్మ (బా. సంధి. 36. పూవులోడను + కూడుకొన్న + రెమ్మ) పరాకమ్మ (శృ. నై. 7-30. పరాక + ప్రియముగాఁ గలిగిన + అమ్మ. పరాకయనునది ప్రవన నామంబు.) భక్తయ్య (బసవ 249 పు. భక్తి + ప్రియముగాఁగలిగిన + అయ్య) దినగోరు (శృ. నై. 7-81; ఆం. భా. దినము + తిరిగెడు + కోరు) దినచల్వాలు (విజయ 2-144. దినము + కట్టు + చల్వాలు) దినవెచ్చము (పాండు. 3-16. దినము + చేయు + వెచ్చము) దినవెచ్చమేరాజుదీర్పఁగలఁడు. (శ్రీనా. చాటువు) దినబత్తెము (హరిశ్చ 4-192 దినము + ఇచ్చు + బత్తెము) నిత్యపడి. (బసవ 352 పు. నిత్యము + ఈయ వలసిన + పడి) జవ్వాదిసెట్టి, పచ్చళ్లబాపత, గాజులసెట్టి (అహో 531 పు) జవ్వనురాలు (అహో 265 పు, జవ్వనము + కలిగిన + ఆలు) కపిలమొదవు (ఆను 3-19. కపిల + వర్ణముగల + మొదవు.) ఉమబోఁటి (బసవ 148 పు; కాశీ 1-58; హర 4-97. ఉమ + అనుపేరుగల + బోఁటి.) షోడశపండువు. (బసవ 162 పు; షోడశ + అను పేరుగల + పండువు = షోడశగణములపండుగుపేరు.) అగ్నిదేవర (కాశీ 5-302 అగ్ని + అనుపేరుగల + దేవర) ఏకాంగిపోరు (ద్వా 1 భా. 6-51. ఏకాంగి + అనుపేరుగల + పోరు) గాడుపుఁజీర (పాండు 2-66. గాడుపు + పోనికొను + చీర – తెరచాఁప) క్షేమతండులములు (ఆముక్త 2-97. క్షేమముకొఱకు + కైకొనిపోవు + తండులములు. "ప్రయాణకాలమందువట్టిచేతఁబోకయింటనుండి కొంఁ

దిగాఁగట్టికొనిపోయెడిబియ్యము—సంజీ) కోక స్తనములు, కమలముఖము (కు.సం. 8-18) కంబుకంఠము (భా.రా. ఆరణ్య 2-272. ఇట కోకాకార స్తనములు కమలాకారముఖము, కంబ్వాకారకంఠ మిత్యాదిగా గ్రహింపనగు. రౌక్మకుంభ స్తన నిభస్తానామ్-(రఘు 2-36) తలఁబ్రాలాద్యాదులు, శాకపార్థివాదులు, ప్రసిద్ధంబులు. తలఁబ్రాలాద్యాదులకు-బా. సంధి 27. శాకపార్థివాదులు - శాకపార్థివుఁడు, దేవబ్రాహ్మణుఁడు (సి. కౌ. 739. సూ. 1310 వా.) త్రిలోకములు (ఆది 5-239 సి. కౌ. 727 బాలమ) మేరుమహీభృత్తు, సుగ్రీవకపి, శ్రీహర్షనృపతి, దధ్యోదనము (ముక్త 351. శ్రీరామ) ఇత్యాదులు.

ఇవార్థకంబునకుఁ గొన్నియెడల దద్భిన్నంబగు నివార్థకంబనుప్రయుక్తంబగు. 38

కట్టెంబునట్లపోలె (ఆది 3-127) అర్చలిచ్చుటగదివోలె (కు. సం. 1-49 వె.) కుంతియుట్టులకై వడి (శాంతి 1-12)

ఉపమానానువాదంబునఁ గొండొకచో నుపమానాంతరంబు ప్రయోగింపం బడు. 39

చిన్ని రామచంద్రుని నగుమోముఁ దామర సిరుల్. (రాఘవ 2-9. చిన్నిరాముయొక్క చంద్రునినగు, మోముఁదామర సిరుల్—భా; చిన్ని రామచంద్రుని యొక్క నగు మోముఁదామర సిరుల్—రా) చిగురుమోవిపగడము (పాండు 2-74) తొడలు చాలఁ జలించు తొండంపుఁగవవోలె, నూరు రంభా స్తంభ యుగము వడఁక. (కు. హ. 1-178) తోఁకచుక్కలఁబోలుదృక్తోయజములు (శృ. నై. 8-60) ముఖపంకజం భవతి చంద్ర సన్నిభమ్. (అహో 527 పు)

ఒకానొకచో విశేష వివక్షయం దుపమానంబు పునరుక్తంబగు. 40

వెత్తమ్ముల తమ్ములైన కనుఁదమ్ముల, ప్రసన్నేందునిభస్తస్యాస్తదాసీన్ముఖ చంద్రమాః" (అహో 527 పు.)

వృత్తిఘటితపదంబులు గొండొకచో విలక్షణార్థాభిధాయకంబులగు. 41

అండజముపాన్పు. (బసవ 134 పు) అండజయాన (మను 2-48. అండజము=పక్షి. వృత్తిని—హంస.) ఎల్లప్పుడు (కాశీ 1-2. అప్పుడు=ఆకాలమున. ఇదివృత్తిగాలవాచకము: ఎల్లప్పుడు=ఎల్లకాలము) నలువ=చతుర్ముఖుఁడు. (వాయి=నోరు వృత్తిని, ముఖము) ఆత్మునిసోయగమున (పాండు 2-34) రెండవవినతా తనూభవుని

యందమునన్ (పారిజా 2-85) తనచేతుల యందమున (వి. పు. 1-75) ఇట సౌందర్యవాచకంబులు వృత్తినివార్థకంబులయ్యె.

**కొన్నియెడల ననాద్య శబ్ద కల్పనంబు గ్రాహ్యంబగు. 42**

తీయవిల్తుఁడు, తుంటవిల్తుడు, చక్కెరబొమ్మ. (అహో 416 పు) తీఁగఁబోఁడి, కొండరామాలి, కవ్వడి- ఇత్యాదులు.

ముక్కంటి, వేగంటి, చలివెలుఁగు, నలువ, తమ్మికంటి, లేడికంటి (అహో 535పు) లోనగునవి యాద్యానుసారిశబ్దకల్పన కుదాహరణంబులు.

**ఇది సమాసపరిచ్ఛేదము**

## ముక్తలక్షణకౌముది

### తద్ధితపరిచ్ఛేదము

అటవర్ణకంబు త్రిప్పునకు భావంబునందగు. 1

త్రిప్పు ... త్రిప్పట.

అడవర్ణకంబు అకకు స్వార్థంబునందగు. 2

అఱక ... అఱకడము

అద వర్ణకంబు వట్టునకు స్వార్థంబునందగు; నగుచో రేఫంబున కొక్కటికి లోపంబగు. 3

వట్టు ... వెఱద

అర వర్ణకంబు బ్రద్ద లోనగు వానికి స్వార్థంబునందగు. 4

బ్రద్ద ... బ్రద్దర; ఒత్తు ... ఒత్తరము.

అటో ఆవర్ణకంబులు చిచ్చునకు మతుబర్థంబునందగు. 5

చిచ్చు .... చిచ్చఱ [విరాట 5-143] చిచ్చుఱ [విరాట 4-83]

అలవర్ణకంబు తావునకు స్వార్థంబునందగు. 6

తావు ... తావలము

అలి వర్ణకంబు ప్రబ్బకు స్వార్థంబునందగు. 7

ప్రబ్బ ... ప్రబ్బలి.

కంటునకసవర్ణకంబు మతుబర్థంబునందగు. 8

కంటు ... కంటసము

అసివర్ణకంబు రూపునకు మతుబర్థంబునందగు. 9

రూపు ... రూపసి

అడువర్ణకంబు మెలఁగునకు స్వార్థంబునందగు. 10

మెలఁగు ... మెలఁగాడు

అదివర్ణకంబేడులోనగువానికి స్వార్థంబునందగు. 11

ఏఁడు ... ఏఁడాది; పంచ ... పంచాది.

ఆమువర్ణకంబును గొండొకచోఁబెండ్లికిఁ గానంబడియెడి. 12

పెండ్లి ... పెండ్లాము

ఇగవర్ణకంబుబుడ్డికి స్వార్థంబుననగు; నమ్మనకు మతుబర్థంబున వైకల్పికంబుగనగు. 13

బుడ్డి ... బుడ్డిగ; నమ్మ ... నమ్మిగ (ఉద్యో 1-315) ఇటనమ్మిక యనిరూపంబు (బా. తద్ధిత 7)

ఇడివర్ణకంబొత్తు పొత్తులకు స్వార్థంబునం బసిమికి మతుబర్థంబున నగు. 14

ఒత్తు ... ఒత్తిడి; పొత్తు ... పొత్తిడి; పసిమి .... పసిమిడి.

ఇరవర్ణకంబు వేగకు భావంబునందగు. 15

వేగ ... వేగిరము

ఇలి వర్ణకంబుపుక్కకు మతుబర్థంబున వెక్కనకు స్వార్థంబుననగు. 16

పుక్క ... పుక్కిలి; వెక్క ... వెక్కిలి.

అంటున కిసవర్ణకంబు స్వార్థంబునందగు. 17

అంటు ... అంటిస.

ఉవర్ణకంబు మతుబర్థంబున నిరునకగు. 18

ఇరుస ... ఇరుసు.

ఉప వర్ణకంబు చిదురకు స్వార్థంబునందగు. 19

చిదుర ... చిదురుపలు. (భీష్మ 2-66) ఇది నిత్యబహువచనాంతంబు. (శబ్దర 10)

ఏడు లోనగువానికుడివర్ణకంబు మతుబర్థంబునందగు. 20

ఏడు ... ఏడుడి, నీరు...నీరుడి; పుల్లి ... పుల్లుడి.

ఉవ వర్ణకంబు చలికి భావంబునందగు. 21

చలి ... చలువ.

అయ్యది యునికి లోనగు వానికి స్వార్థంబున నగు; నగుచో నుపోత్తమేత్వంబున కుత్వంబగు. 22

ఉనికి ... ఉనుకువ; ఇక్క ... ఇక్కువ; వెల్లి ... వెల్లువ.

ఉవు వర్ణకంబు గడికి మతుబర్థంబున బిగిలోనగువానికి స్వార్థంబున నగు. 23

గడి ... గడువు; బిగి ... బిగువు; పసి ... పసువు.

కడవర్ణకంబు రేపునకుస్వార్థంబునందగు; నగుచో నుత్వంబున కత్వంబగు. 24

రేపు ... రేవ కడ, ఆడియునిట గొండొకచో నగు: రేపాడి.

కిలి వర్ణకంబు కమి పిడులకు స్వార్థంబునందగు. 25

కమి ... కమికిలి; పిడి ... పిడికిలి.

గడ వర్ణకంబు వెలికి స్వార్థంబునందగు. 26

వెలి ... వెలిగడ.

టవర్ణకంబు రివ్వకు స్వార్థంబునందగు; నగుచో జడ్డకు లోపంబగు. 27

రివ్వ ... రివటు.

టివర్ణంబొండునకు భావంబునందగు; నగుచో నంతిమాక్షర లోపంబగు. 28

ఒండు ... ఒంటి. టివర్ణాదేశవిధి (ప్రౌఢ తద్ధిత 15) ప్రామాదికంబని యెఱుం[illegible] నది.

తవర్ణకంబు బంకు అంకులకు మతుబర్థంబునందగు; నగుచో నుత్వంబున కెత్వంబగు. 29

బంకు ... బంకెత; అంకు ... అంకెత (పండితా 81పు-సూ.మూ)

తనవర్ణకంబు గొండొకచో స్వార్థంబునఁ గానంబడియెడి. 30

తాపు ... తాపుఁదనము

దలవర్ణకంబు పట్టులోనగు వానికి స్వార్థంబునందగు. 31

పట్టు ... పట్టుదల.

పవర్ణకంబు బడలునకు స్వార్థంబున నగు; నగుచో నంతిమాక్షర లోపంబునగు. 32

బడలు ... బడప

పలవర్ణకంబు వెలి ప్రభృతులకు స్వార్థంబుననగు; నగుచోనిత్వంబున కుత్వంబు, నువర్ణంబునకు లోపంబునగు. 33

వెలి ... వెలుపల; దా ... దాపల; లోను ... లోపల; వలను ... వలపల.

పిరివర్ణకంబు వలికి స్వార్థంబునందగు. 34

వలి ... వలిపిరి.

చలీతరంబులకును స్వార్థంబునఁ గొండొకచో మిరివర్ణకంబు గానంబడియెడి. 35

కసి ... కసిమిరి; వలి ... వలిమిరి-ఇత్యాది.

ఎడలోనగు వానికి వువర్ణకంబు స్వార్థంబునందగు. 36

ఎడ ... ఎడవు; అన్ను ... అన్నువు; కందు ... కందువు. ఇత్యాదులు.

పొలకు స్వార్థంబున సువర్ణకంబగు. 37

పొల ... పొలను.

కాప్రత్యయాదులు గొండొకచో సంస్కృత సమంబులమీఁదను గానం బడియెడి. 38

కోపకాఁడు (భీమ 4-13; కాశీ 4-90 సారంగ 2-115) గోహత్యగాని (వరాహ 10-65) కార్యకాఁడొయంకకాఁడొ (ఆము క్త 4-263) అభిమానకత్తె (బసవ 336 పు) కోపకత్తె ( క్రీడా 129 ప) మనసరి (రామా 1-138) దాక్షిణ్య బలిమి (శృం.నై. 2-80) మద్భుజాబలిమి (భాగ 6-391)

తరవర్ణకంబొకానొకచో నాచ్ఛికములమీఁదను గానంబడియెడి. 39

మేలు .... మేలుతరము ( ప్రభావ 4-143) మేల్తరము (వాల్మీకి 3-136)

కొన్నియెడల టికవర్ణకంబు నిత్వంబునకు లోపంబు చూపట్టెడి. 40

లంజెర్కము (బసవ 335 పు;) నిరం 2-129) కన్నెర్కము (పండితా 740పు) చుట్టర్కము (ఉ. నా. 2-171) రాచర్కము [నిరం 1-84]

ఎఁడు వర్ణకంబు కడుపునకుం జూపట్టెడు 41

కడుపు ... కడుపెఁడు (కళా 7-122)

ఒకానొకచో బంటివర్ణకంబు పరంబగు నపుడు ముక్కునకు నగాగ మంబు గానంబడియెడి. 42

ముక్కున బంటి (భా. రా. యు. 746 ప)

అవిహితంబులు వర్ణకాంతరంబులు ప్రయోగానుసారంబుగ నూహ్యం బులు. 43

టక్కుదారి. ఇటమతుబర్థంబున దారి వర్ణకంబు. తెగుదారి. ఇట వలోపంబు (తెగువ + దారి) కోపదారి. ఇటసంస్కృత సమంబుమీఁద దారివర్ణకంబు. పంది - ఇటమతుబర్థంబున దివర్ణకంబు; ముందటి వ్రాయిక్కిఁ బూర్ణబింద్వాదేశంబు. పన్ను + ది = పన్నుగలది - దంష్ట్రి).

ఇత్యాదు లెఱుంగునది.

ఇది తద్ధితపరిచ్ఛేదము

## క్రియా పరిచ్ఛేదము

నుజ్యంతంబు మీఁది యుండు ధాతు వర్తమాన క్రియాపదంబు లొకా నొకచో భావ్యర్థకంబులగు. 1

విడువనున్నవారు (అరణ్య 1-296) ప్రార్థింపనున్నాఁడు, మేల్కొన నున్నాఁడు, ప్రణుతింపనున్నాఁడు, దీవింపనున్నాఁడు, (కాశీ 7-242) వరమీ నున్నాఁడు. (కాశీ 4-50)

కొన్నియెడల నాశీరాదులందు లోట్టునకుం గావుతాదులను ప్రయుక్తంబులగు. 2

శుభంబగుఁగావుత, శుభంబగుఁగాత, శుభంబగుఁగాక.

లోట్టు డుమ్రుల కెడుమ తమ త వర్ణకంబులగు. 3

తునియ, లరయ్యెడుమ యనవుడు నది యట్లయయ్యె. (సౌప్తిక 2-124) ఇష్ట దాయి ప్రసన్నుఁడయ్యెడుమ నాకు. (అను 2-287) ఉండెడుమ కప్పలు. (అను 3-143) పొందెడుమంచు. (ఆది 7-182) నీకులగ్గయ్యెడుమని. (సభా 2-264) నీబుద్ధి ధర్మైకనిష్ఠ గావుతమ. (అను 5-442) ఒనరించు, చుండుఁగావుతమ యఖండిత ముగ. (ఆది 8-63) వృద్ధిగావించుఁగాత యీవిశ్వమునకు. (శృ. నై. 8-201) చేయుఁ గాతయలరి. (పాండు 1-7) ఆదిత్యుండొసఁగుఁగాత యభ్యుదయంబుల్. (దశ 1-4) మకారాదేశవిధి (బా. క్రియా 28) లక్ష్యలక్షణ విరుద్ధంబగుటం జేసి యనాదరణీయం బని యెఱుంగునది.

విధీతరంబులందును లోట్టునకు మాఱుగా నది యను తచ్ఛబ్దంబును ముందు నుగాగమంబునగు. 4

ఉపదేశంబునకు: మఱివ కనుష్ఠించునది. (ఆది 3-203) ఇచ్చునది ధనము పాత్రునకు (ఆది 3-204) సంప్రార్థనంబునకు : ఆరసియుండునది దానవాంతక. (సభా 2-82) ఉరరీకారంబునకు : ఇమ్మునివరునకు నన్నుఁ బ్రి,యమ్మున నిచ్చునది. (అరణ్య 2-332) హితబోధకు ; ఏమఱకుండునది. (ఆది 2-181) అభ్యర్థనంబునకు : దీని మఱచునది. (సభా 2-265.)

ఒకానొకచో సంప్రార్థనంబున మధ్యమ దుజ్వర్ణకంబు పరంబగునపుడు దుగాగమంబును, దానియుత్వంబున కత్వంబు నస్మదర్థ సహావస్థానంబు నందగు. 5

చెప్పుదండు (బసవ 350 పు) చెఱుపుదండు (బసవ 409 పు) పోదండు (బసవ 422 పు; ఉ. హ. 3-139) చూతండు (బసవ 509 పు] చూతఁడు (బసవ 564 పు. శృం. సం. 10 పు) చెఱుపుదండు (బసవ 409 పు.) వెదకుదండు (భా. రా. కిష్కిం. 641 ప)

పదము పదఁడు లోనగువానియందు సహిత మస్మదర్థసాహిత్యంబుభాసిల్లునంద్రు.

సంప్రార్థనంబులందు లజికి సహిత మదాదు లనుప్రయుక్తంబులగు. 6

చిత్త శాంతియొనర్పవే. (సభా 2-35=ఒనరుపుము) కానవా? వారిజేశ్వరాఁగమలవైరి. (వసు 3-36. కానవా ? = కనలేదా ?) ప్రోవవా నన్ను జగదేకపూజ్య పాద! (అహో 607 పు. ప్రోవవా=ప్రోవుము) నిశ్చయించుటె, వ్వరిఁగొని యింత నీవెఱుఁగవా? (కర్ణ 1-246. ఎఱుఁగుదువు గదా?) చెప్పవమ్మ (ఆది 2-45=. చెప్పుమా) విచ్చేయవమ్మ, కావమ్మ, రావమ్మ, లేవవమ్మ. ఇటవలోపంబునగు. లేవమ్మ (భీమ 4-175=లెమ్ము.)

కొన్నియెడల సుబంతములమీఁద సహిత మియ్యవి యర్థవిశేషద్యోతకంబులగు. ఇదిరియో (ఆది 6-172=ఇదిగో) ఇదో (పండితా 94 పు, కాలహ 3-137=ఇదిగో) వేనొక బ్రాహ్మణుండనే? (ద్రోణ 5-32) ఇత్యాది.

చుశబ్దంబునకు ముమ్ముడుజ్జులు, చూశబ్దంబునకు వురువర్ణకంబులు విభాషనగు; నగుచోనదాదులు బహుళంబుగ ననుగప్రయుక్తంబులగు. 7

చుశబ్దంబున కదాదులు యథాసంభవంబుగనగుననియుఁ, జూశబ్దంబున కెదాదులు నిత్యంబుగ నగుననియు బహుళగ్రహణముచేత నెఱుంగునది.

చుశబ్దంబునకు :– చుము, చుమ్ము; చుఁడు, చుండు; చుమ, చుమా, చుమి, చుమీ; చుఁడి, చుఁడీ. వెలియుఁజుండో (బసవ 292 పు) తప్పినవాడుసుండో (పండితా 117 పు) బహిసుండో (కాశీ 7-249) మాయమ్మానను (కళా 6-161)

చూశబ్దంబునకు :– చూవె (సభా 2-134. చూ+వు+ఎ), చూవే. ఇట ద్విత్వంబునగు.

చువ్వె, చువ్వే (అరణ్య 1-373; శాంతి 4-68) చూరె (ఆది 5-150. చూ + రు + ఎ), చూరే (శాంతి 6-304) నాకసమ్మతమయి చూ- వెలిఁగ (సభా 2-98) నీలంబుగాదు చూ (ప్రభావ 3-87)

రవర్ణంబు పరంబగునపుడు మధ్యమ మువర్ణకంబునకు లోపంబు విభాష నగు; నగుచోఁ గృతహ్రస్వంబునకు దీర్ఘంబు నుత్వంబున కత్వంబు నగు. 8

కానీరా (ఆముక్త 7-18. కానిమ్ము + ర) కానిమ్మురా (భాగ. 10 స్కం....) కస్తూరికా భిక్షాదానము సేయరా (శ్రీనా. చాటువు. చేయుము + రా) ఏలర యీ చలంబుడిగి యేలర (మను 3-93. ఏలుము + ర) ఆమ్రేడితంబు నుత్వంబున కత్వంబు చూపట్టదు. విడువిడురా (కళా 3-52 విడువిడుము + రా)

కొలకు కంటె పొంటెలు పరంబులగునపుడు ధాతుజవిశేషణంబుల మీఁది యమహత్తచ్ఛబ్దార్థమునకు లోపంబు ప్రాయికంబుగనగు. 9

టవర్ణకలోప విధానము (ప్రౌఢ. క్రియా 14) ప్రామాదికంబని యెఱుంగునది. రక్షించుకంటె, మొ॥ (ఆది 2-91, 8-308; ఉద్యో 3-158; 275) చూపుకొలకుసె. మొ॥ (కళా 3-16; వి. పు. 1ఆ) చలుపుపొంటె, మొ॥ (కర్ణ 3-74; హరి పూ. 7-160)

"ధనము వడయు దానికంటె (విరాట 3-2?4) నిత్యాదులు ప్రాయిక గ్రహణముచేత గ్రాహ్యంబులు.

అడవర్ణకంబు కేరులోనగు వానికిఁ గొన్ని యెడల భావంబు నందగు. 10

కేరడము (ఉద్యో 1-353; నరస 2-25; ఉ. హ. 5-282; పాండు 3-43) సోలడము [శృం. శా. 3-220] మెత్తడము [వి. పు. 2-362] ప్రేలడము (పాండు 3-43) త్రావడము (హ. న. 4-43)

ఒకానొకచో డువర్ణకంబును భావంబునందగు. 11

చేయుడు (ఆది 7-16 = చేయుట) ఓర్చుడు, (కు. సం. 10-151 ఓర్చుట) ఇయ్యది నుశబ్దఘటితం బర్థవిశేషద్యోతకంబగు. అంబుజమిత్త్రుఁ డంబుద లవాంతరితుండగుడుందదీయతే. జంబు జగజ్జనంబులకు శక్యమె కప్పఁగ (ఆది 7-221 అగుడున్ = అయినంతమాత్రమున) ఆనంతర్యంబున నగు ద్రుతాంత డువర్ణక మీ భావార్థక డువర్ణకంబే కాని యన్యంబు గాదంద్రు.

పురార్థయోగంబువనగు కజికిఁగొండొకచో నుండు ధాతువనుప్రయుక్తంబగు. 12

తోయజమిత్త్రుఁడు గ్రుంకకుండు మున్న (ద్రోణ 2-28 = గ్రుంకకమున్న) పూవకుండఁగా మున్న (కు. సం. 4-91 = పూవకమున్న)

కొన్నియెడల భూతకాలికాసమాపకక్రియ ప్రభృత్యర్థంబునందును, భావార్థంబునందును గానంబడియెడి. 13

ప్రభృత్యర్థమునకు; ఏనేఁడులగుడెంచె నర్జునుండేగి, (ఆరణ్య 4-2 - ఏగి = ఏగినమొదలుకొని) ఎనయంగ నార్నూఱు నేఁబదియేండ్లు, సనియె నీవిట వచ్చి సంయమివర్య (బసవ. 3 ఆ. వచ్చి = వచ్చినమొదలు) క్రొన్నెత్తురు గ్రాంతుఁ ద్రావఁబడి మఱి తెగటారి పడియున్నవాఁడు దుశ్శాసనుండు (స్త్రీ 2-55 పు. త్రావఁబడి = త్రావఁబడిన మొదలుకొని] భావార్థమునకు: ఏనెన్నఁడుఁదొల్లిఁజూచి యెఱుఁగను నిన్నున్ (ఆది 4-99 చూచి = చూచుట) పెక్కాలములం జొచ్చి యెఱుఁగఁడు (ద్రోణ 2-141 చొచ్చి = చొచ్చుట) ఎన్నఁడున్ మఱి యిట్టులేగి యెఱుంగవు (కళా 3-139 ఏగి = ఏగుట)

భూతకాలికాసమాపకక్రియకుఁ గొండొకచో నుండు ధాతువధ్యాహార్యంబగు. 14

చుంచుపట్టితిగిచి, చెంపవెట్టి, రాలరువ్వి, కాళ్లఁదాఁచి, నెఱికురులుఁజారు నాసలు నిబ్బరంపు, గుబ్బచన్నులుఁ దొడలపెక్కువయుఁగలుగు, మృగవధాజీవ శుద్ధాంత మీననయనలు. (పాండు 1-126 'ఉన్న' శబ్దంబిట నధ్యాహార్యంబు)

ఒకానొకచోఁ జేయు ధాతువునకు నుజిపరంబగునపుడు కదహల్లునకు ద్విత్వంబు చూపట్టెడు. 15

ఎద్దినేఁ జెయ్యంగాఁగలయూడిగంబని (కాలహ 1-58)

తిగుచుధాతుపర్యాయంబు తివ్వుధాతువు గానంబడియెడి. 16

తివ్వుచున్ (కు. సం. 8-58) తివ్వను, తివననునవి తిగుచుధాతునుజ్యంతంబులు గావని తాత్పర్యము. (ప్రౌ. క్రియా 20)

ఉనుధాతు వొకానొకచో నుండునకు బహుళంబుగనగుచో నుత్వంబునకు లోపంబగు 17

ఉన్నేని [శాంతి 5-275 = ఉండునేని] ఉన్నది [ఆది 3-206 ; శాంతి 3-239 = ఉండునది]

నుజ్యంతంబులగు నను కొనుల నవర్ణంబునకుఁ గొండొకచో లోపంబు గానంబడియెడి. 18

మిన్నెట యందుకొన్గలరె. [అనుభవ 190 ప. అందుకొన్ = అందుకొనన్] హిమవన్నగమందనరారు. [వసు 2-12 అన్ = అనన్] అనిచేనంటిచెనంటిఁ జూచియతఁడిట్లన్ (సారంగ 2-86. అన్ = అనున్) అనుప్రయోగవిశేషం బొకండు చూపట్టెడు.

ప్రాది శబ్ద పూర్వకంబులయిన యేకస్వర ద్విస్వరంబులయించుక్కునకును గొన్నియెడల నియుడాగమంబు విభాషనగు. 19

పరిభ్రమియించు (అరణ్య 2-77) ప్రతిఘటియించు (శృం. నై. 4-9) ఉత్తరియించు (శృం. నై. 7-37) సంభజియించు (కాశీ 3-174) ప్రతివసియించు (కాశీ 2-18) అభినుతియించు (వరాహ 10-86) పక్షంబున — పరిభ్రమించు ఇత్యాది.

కవర్ణకంబుం గొన్నియెడల నాత్మనేపదార్థంబున నను ప్రయుక్తంబగు. 20

ఎత్తుక (జై. భా. 1-103: వి. పు. 5-58: 6-81; ఆముక్త 6-18) ఊడ్చుక (రాజశే 2-87) కట్టుక (జై. భా. 2-109) కూడుక (ఘటిక 2-114) గ్రుచ్చుక (రాజశే 2-171) చూచుక (నిరం 2-59) తెచ్చుక (నిరం 2-122) పట్టుక (జై. భా. 4-128) హత్తుక (ఘటికా 2-39)

ఒకానొకచోఁ గ్రియాఫలంబు కర్తృగామియగుచోఁ గొను ధాతువు గానంబడదు. 21

సగరుఁడనురాజు ... దక్షుమఖుక్షయకరు ... ప్రత్యక్షము గావించె (అరణ్య 4-48;49)

టవర్ణకంబు పరంబగునపుడు గొండొకచోఁ జను ధాతు నుస్థానంబు నందును నున్న గానంబడియెడి. 22

చంట నీయురమానక చంటదగునె (సారంగ 2-99)

వేధాతువునకించుక్కపరంబగునపు డయుగా గమంబగు. 23

ధాతయును విధాతయు వారియొగి వయించు [ఆది 1-118 వే+ఇంచు=వే+అయ్+ఇంచు=వయించు]

కుచ ధాతువునకు సంక్షిప్తిని గుణంబు విభాషనగు. 24

సుందరత్వమునకుఁ జోటిచ్చి తా సంకు, చించెననఁగడుఁ గృశించె నడుము' (కవిక 1-76) మహీధర సన్నిభంబగు తనగాత్రంబు సంకోచించియణుమాత్ర దేహండగుచు. (భా. రా. సుందర. 76ప) పరిమళంబుల్ సాలకొక్కొక్కచోఁ, గొసరొక్కించుకగ్గలైనేనియును సంకోచంబు గాకుండ. (శృ. శా. 1-7)

వెనుదీయు నను నర్థంబున గుణంబు నిత్యంబు! గోపత్వంబున నుండుచున్ మనకు సంకోచింపఁగా నేటికిన్. (భాగ 10-పూ. 787 ప.)

ఉత్పూర్వకంబగు సృజికి గుణంబు విభాషనగు. 25

ఉత్సృజించు (కాశీ 5-258), ఉత్సర్జించు (కాశీ 6-46)

రంజాదుల యించుక్పకారంబునకు నబిందుకంబున కప్రేరణంబునఁ గొండొకచో ద్విరుక్తలకారంబు గానంబడదు. 26

అనిమిషతతి ప్రచ్ఛన్న, సంచరణమున వర్తించుటయును. (విరాట 1-54) వారిఁ గూడి వర్తించు తెఱంగు. (ఉద్యో 1-256) వర్తించును (ఆను 2-456) కంపించు శరీరములు (కు. సం. 9-129)

రంజుభుంజులకు నిత్యంబుగా, గర్జునకు బహుళంబుగా నించుక్కగు. 27

రంజిల్లు (య 2-40; 4-112) రంజిల్లెడువాని. (రామా3-44. అచ్చతెనుఁగు పద్యము) ప్రతిలేకగర్జు నతిశూరు. (కు. సం. 12-169. గర్జు=గర్జించెడు) బాహుళకంబుచే నిక్కార్యంబు యథాసంభవంబుగ నగునని యెఱుంగునది.

ఇచ్ఛకించుక్కు పరంబగునపుడు సంధి వైకల్పికంబుగనగు. 28

ఇచ్ఛించు (భాగ 8-661) ఇచ్ఛయించు (భాగ 8-196; ఉ. రా. 5-303)

చుక్కు పరంబగునపుడు పడుధాతు నుత్వంబునకుఁ గొండొకచో నత్వంబు చూపట్టెడు. 29

చాలఁ, బఱచవై సంతోష పఱచవైతి (పాండు 3-36) తో అంగుటతపో తడంబఱచి పురుషులకున్. (కళా 7-224)

ఇత్వంబుగాని యెత్వంబుగాని కూడుచో సనాద్యంబయిన యుత్వంబున కిత్వంబు పూర్వకావ్యంబులం గలుగదు. 30

మగుడి (ఆది 1-101) కుంభపీఠంబు పగుల్చి యసుర. (హరి-పూ. 4-148) అర్వాచీన కృతులం దిత్వంబు ప్రాయికంబుగ నగు-కాశీపురి, కింగరమను రాగమున మగిడి చనుదెంచెన్. (భోజ 6 ఆ) కెరలుచు వక్షమైదిటఁ బగిల్చిన. (జై. భా. 4-16)

టవర్గకంబు పరంబగునపుడు కొండొకచో నాగమ చకారంబునకుఁ బకారంబు గానంబడియెడి. 31

పోకప్రొద్దునఁ జరింపుటనీతియే (వరాహ 3-125) త,లంపుట భావ్యంబె పెద్ద లారా మీకున్. (వరాహ 10-35.)

ఒకానొకచో నుంచుప్రభృతులకు ధాతుజ విశేషణత్వంబునం, బెంచున కికారపరకత్వంబున నాగమచకారంబుపకారంబొండెనగు. 32

ఉంచు, తీఱుచు, అనిపించు ననునవి యుంచుప్రభృతులు. కనకంపువనసొంపుకడ నుంపు రుచిపెంపు (వసు 3-69 ఉంపు=ఉంచెడు) పితరులఋణము దీర్పడు సూనుఁ డెందని (రాఘవ 1-46 తీర్పడు = తీర్చెడు) చంద్రబింబము సొంపుసవతు గాదని పింపు (శృ. శా 2-140. అనిపింపు = అనిపించెడు) పెంపి (వసు 4-55=పెంచి) పెంపిరేనిదానికంపు మాయనిభంగి (ద్వా 1-98. పెంపిరి = పెంచిరి) పెంపితివి (భాగ 10 స్కం. పూ. 154. పెంపితివి= బాధించితివి)

పుచ్చు లోనగువాని సిద్ధచకారంబునకు ద్విరుక్తంబునకు ముత్తుపరంబగు నపుడు గొన్నియెడల వకారంబు గానంబడియెడి. 33

పుచ్చు, గ్రుచ్చు, వ్రాక్రుచ్చు, విచ్చు, వ్రచ్చు, ఇచ్చు. ఈయవి వ్రుచ్చు లోనగునవి.

వ్రువ్వఁగ (ఉద్యో 2-10; పాండు3-105) గ్రువ్వన్ (కర్ణ 1-165; ఉద్యో 3-220) గ్రువ్వవె (పారిజా 3-32) వ్రాక్రువ్వకుమీ (రామా 9-140) వ్రాక్రువ్వన్ (విక్రమా 5-120) వ్రాక్రు, వ్వనన్నంబై చెన్నారవనిశరభక్రీడ సంజ్ఞన్. (అప్పక 4-411) ఛీ నిణాంహోలతల్, వివ్వన్. (కాలహ 3-180.) వ్రవ్వన్ (స్త్రీ. 2-64) వనరాశి త్రోవ యివ్వక, (రంగనా)

ఆశీరాద్యర్థకంబులగు త, తమ వర్ణకంబులు పరంబగు నపుడిచ్చున కీవును, బ్రోచు చకారంబునకు వకారంబును గొండొకచోఁ గానంబడి యెడి. 34

శ్రీలుమా, కీవుతమంచు, (వి. పు. 6-357) ఈవుతన్. (ఉ.రా. 1-5; వాల్మీకి 1-6) ప్రోవుతన్. (వాల్మీకి 1-7; వసు 1-1.)

ఏచునకు నిర్బిందుకంబునకు ముత్తు పరంబగునపుడు వకారంబు గాదు. 35

ఏచు ... ఏచక

ఆగమచకారంబునకు నెఱసున్నముందు లేనిదానికిని దుక్కుపరంబగు నపుడు పకారంబు చూపట్టెడు. 36

ఒనర్పుదురు (పాండు 5-292; హ. న. 4-58)

నేరుచునకు లాఁతిచో సహితము రులోపంబు గానంబడియెడి. 37

నేచియుం నేరకుండియును. (దశ. 3-140) నేచిన యట్లచటనచట నిలిపితి (మాసల 215 ప) నేచుకొనం గలరు. (వరాహ 12-77.)

చువర్ణకంబు పరంబగునపుడును గొండొకచోఁ బోవునకు వులోపంబు చూపట్టెడు. 38

పోచున్నవాఁడో. (కళా 3-96) పోచున్నారు. (ప్రభావ 5-39) శుంభద్వస్తువులెల్లఁ జూతునని పోచున్. (కళా 4-151)

లిట్టు వుఙ్లు పరంబగునపుడు పోవు ధాతు యివర్ణంబునకు లోపంబు గొన్నియెడలఁ గానంబడియెడి. 39

బొడ్డుపల్లెను గోడ్డేటి మోసపోతి (శ్రీనా. చాటువు) పోతిమి (వరాహ 10-37)

అగుపోవులయెను వర్ణకంబు నెత్వంబున కత్వంబు గొండొకచోఁ జూపట్టెడి. 40

ఆఱిడి నోములయ్యను గదా! తనకంచు (శృ. శా. 4-129) అయ్యెన్నాలవ జాము వచ్చి తడవాయన్ (వేం. పంచ 4 ఆ) అయ్యో! నీసుతుగ్రద్దయెత్తుకొని పోయన్. (వేం. పంచ 1 ఆ) అని శాపావధిఁ దెల్పిముద్గలుఁడు పోయన్ (వేం. పంచ 4 ఆ)

కొండొకచో లేచునకు జీత్తుపరంబగునపుడు సహితము చులోపంబు చూపట్టెడి. 41

లేకయుండు = లేవకయుండు (మాసల 211 ప.) లేనెత్తి = లేవనెత్తి (బసవ 148 పు) లేనెత్తన్ = లేవనెత్తఁ (క. ష. సర్వల. సంధి 174 ప)

వెలచునకు ముత్తు పరంబగునపుడు గొండొకచోఁదుది వ్రాయికి లోపంబు చూపట్టెడి. 42

వెలికుము (కాశీ 5-71 = వెలివకుము) వెలికుండు (సర్వల. సంధి 173. = వెలివకుండు.)

మఱచు కడచులకు జీత్తు పరంబగునపుడు గొన్నియెడల వలోపంబగునగుచోఁ బూర్వస్వరంబునకు దీర్ఘంబు బహుళంబుగ నగు. 43

మఱాము = మఱివము. (హర 2-132) మఱాకుము = మఱివకుము. (ఉద్యో 4-70; బసవ 160 పు) మఱాక. మఱిక (అహో 433 పు) మఱిను (ఉ. రా. 6-285) కడాఁబలుకు = కడవఁ బలుకు (ఆం. భూ 178 ప) ఒల్లకు దీర్ఘంబుం గలదండ్రు: ఒల్లాఁడు. (అహో 433 పు)

కలుగునకుఁ బ్రాప్త్యర్థంబునందును లట్టు పరంబగునపుడు కలయగు. 44

ఎఱుకగలరె [ఆది. 2-34] జ్ఞానముగలఁడేనిన్. [ఆది 3-240] ఇది వడి, గలదు మనసుకంటె గాలికంటె [ఆది 1-115] మగఁటిమి గలఁడని యెడు న, మ్మిగ. [ఉద్యో 1-315]

కలుగునకుఁ బ్రాప్త్యర్థాదులందును లజీ పరంబగునపుడు లేయగు. 45

ప్రాప్త్యర్థమునకు : మతిలేరైరి [భీష్మ 3-227] లావులేరైరి [ఆశ్రమ 2-152] సామర్థ్యమునకు : గెలువలేమి దైవకృతముగాదె [భీష్మ 2-352]

చువర్ణంబుతోడ దుగ్ధకారంబు తకారంబు గొండొకచోఁగాదు. 46

వసించుదురు [భాగ. 10 స్కం. ఉ 1280] నించుదురు [కావ్యాలం 9-160]

భూతంబున లజీకి లాడంతంబగు నగుధాతువును ననుప్రయుక్తం బగు. 47

నమ్మనేరన, య్యెద [ఆది 4-30] నేర నయ్యెదన్ [ద్రోణ 1-369] వృష్టిలే, దవు [ఆది 4-249] ఎఱుంగనయ్యెడున్ [విరాట 2-84; 4-91] అడంగ దయ్యె డున్ [నిర్వ 9-95]

ఉన్నేతరంబులు పరంబలగునపుడు సహితము నుజ్యంతంబగు నగు ధాతువునకుఁ గొన్నియెడల హ్రస్వంబు విభాషనగు. 48

కవలయు [అను 4-26; కాశీ 4-26; కళా 7-239] కఁదలఁచెదు [ద్రోణ 3-71] కఁగోరు. (కు.సం.6.65) కఁదగు (బసవ 61పు) పక్షంబున–కావలయు, కాఁదలఁచెదు, కాఁగోరు, కాఁదగు.

వునుములు పరంబులగునపుడు క్త్వదర్థక నవర్ణకంబు మీఁది తచ్ఛబ్దంబు నకు లోపంబును దత్పూర్వస్వరంబునకు దీర్ఘంబును గొన్ని యెడలఁ గానఁబడియెడి. 49

పట్టినావు, కోరినావు, క్రిందుపడినావు, కాచినావు(నిరం3-29) ఒనరించినాము ఘటికా 2-194)

నామపదంబులకుఁ బ్రథమాద్వితీయాన్యతర విభక్త్యంతంబులకు ధాతువులను బ్రయుక్తంబులయి విలక్షణార్థాభిధాయకంబులగునవి శబ్దపల్లవంబులు నాఁబడు. 50

చూ. మీఁదు.

శబ్దపల్లవ పూర్వావయవంబు ప్రథమాంతంబగుచోఁ గ్రియార్థ మాధారభూతంబగు కర్తృయం దుపచరితంబగు. 51

తేఁకువసెడియె నీపాలుఁడు (ఆరణ్య 4-353) చెలువేదఁ జందురుండు. (ఉద్యో 2-10) సుభటవర్గంబు లొక్కట సొబగుమాలె. (భా. రా. యు 1140 ప) బడలికలు వాసి చనుము [మను 2-47] ఇటనవయని కర్తృకత్వవిధానంబు (ప్రౌ. వాక్య 17) త్యాజ్యంబు.

శబ్దపల్లవంబు ప్రథమాంత పూర్వపదంబు తఱుచుగ నకర్మకంబగు. 52

ప్రథమకు :- ఈకొను, ఈయకొను, తలపోయు, కయిద్రావు, ద్వితీయార్థ ప్రథమకు: ఆఁకొను, రక్కొను, మేకొను, మేలుకొను, మేలుకాంచు, అలవడు, చొప్పడు, వెలువడు, వాసపోయు, ఆపోవు, విజయుంచేయు, తూపాడుచు, చిందులు ద్రొక్కు, నాట్యమాడు, చీకటితప్పుచేయు, [కాశీ 2-80] ఇతర క్రియాసాధారణబుద్ధి సేయు, [ఆరణ్య 6-182] సప్తమ్యర్థక ప్రథమకు : చేపడు, పైపడు.

తఱుచుగ ననుటంజేసి సకర్మకంబులుం గొండొక గలవని తాత్పర్యము. అలఘుభుజా నను వివాహమగుదే. (ఆది 3-163: అహో 625 పు)

ద్వితీయాంత పూర్వకంబు శబ్దపల్లవం బుభయంబు నగు. 53

ఉభయంబునా సకర్మకంబు నకర్మకంబు నని యర్థము.

సకర్మకంబునకు: వెలిఁబెట్టిరే బాడబులు పరాశరుఁబట్టి దాసకన్యాకేళిఁ దప్పుఁజేసి (మను 3-73 వెలిఁబెట్టు = బహిష్కరించు: తప్పుఁజేయు = తప్పుగాభావించు) కొండ లెల్లను దనుఁ గొండఁ జేయ [విక్రమా 2-5 కొండఁజేయు = గొప్పచేయు) తెనుఁగుంజేయరు. (భాగ. పీఠిక. తెనుఁగుంజేయు = తెనిఁగించు) అతనిం బెండ్లిఁ కొడుకుంజేసి (అహో 625 పు) అకర్మకమునకు: శరణార్థిఁజేయు (కాలహ 4-53 = శరణార్థియని పలుకు) దొంగలానఁబొడిచినఁగోకలే, విడుతురె [కళా 3-139. ఆనఁ బొడుచు = ఒట్టుపెట్టుకొను, ప్రమాణముచేయు)

శబ్దపల్లవ పూర్వావయవంబులగు కొన్నిశబ్దవిశేషములకు ధాతుయోగంబున నుగాగమంబగు. 54

తడఁబడె దివ్యబాణములు (భీష్మ 3-317) నం,దనుఁడొక్కఁడుసు శేమియానగరు చిన్నంబోయె; (వరాహ 1-92) నానారత్నములుండఁ జూచి కడుచిన్నంబోయి. (కాళహ 2-119) ఏ,లవిచారింపఁగ నెల్లియున్ వ్రతము కొల్లంబోయినం జూచెదన్. (కాలహ 2-114) వెల్వెలఁబాఱె. (మను 3-56)

పశు శబ్దంబుమీఁది పడునకుఁ బ్రేరణార్థకత్వంబు నిత్యంబు. 55

పశువరింతు [సభా 1-189; ఆరణ్య 5-55; బసవ. 238,420 పు.] పశుపటుచు. (ఆరణ్య 3-215)

ధాత్వాదులకు ధాతువు లనుప్రయుక్తంబులయి ఘటక క్రియలు నాఁబడు. 56

కూరుచుండు, నిలుచుండు, కొంపోవు, కొనిపోవు, చనుదెంచు–ఇత్యాది.

కొన్నియెడలఁ గ్రియ లర్థవిశేషంబున ద్విరుక్తంబులగు. 57

పొలిసితిరి పొలిసితిరి వేపొందు దొలఁగి. (ఉ. హ. 4-60) నిండె నిండె నిక్కంబునకున్ (విరాట 5-370)

క్రియాపదంబులు ద్విరుక్తంబులగుచోఁ బూర్వపదంబునకు నుజ్యంతంబును మీఁద నేత్వంబును గొండొకచోఁ గానంబడియెడి. 58

చేయనేచేసెన్, రానేవచ్చెన్, పోనేపోను. (అహో. 619 పు.)

ఒకానొకచోఁ జేదర్థయోగంబున లృట్టునకు లిట్టుగానంబడదు. 59

గర్వితుండగునేని శాప. హవ్యవాహ ఫలంబు వాఁడనుభవించు. (ఆరణ్య 1-103) ఇతనికిఁ గూర్తురేని ధనమిత్తురు. (సభా 2-10)

ఏమిశబ్దము పరంబగునపుడు గొండొకచోఁ జేదాద్యర్థక నాంతంబునకు లిట్టుగన్పట్టు. 60

నీతియయ్యేనేమి దుర్ణయమయ్యేనేమి. (ద్రోణ 3-27) ఎచటమెలఁగనేమి... నియతిగల్గు యతికిమోక్షవీథి యాటపట్టు (అను 5-431)

**అవ్యర్థంబునందుఁగొండొకచో లృట్టునకు లిట్టుచూపట్టు. 61**

ఇంతులగోష్ఠినున్నయతఁడెంత వివేకముగల్గలేని యత్యంత మదాభిభూతుఁడగు (ఆది 7-69)

**యచ్ఛద్దాన్వయంబున లృట్టునకు లిట్టు విభాషనగు. 62**

ఇందు లక్ష్యమెవ్వఁడే సేనాతవి పరి, యింపు నెమ్మితోడ నిందువదన. (ఆది7-172) వీరలిరువురు ... ఎచ్చోట నెదురుగా మెలఁగిరచట మనరథంబల్ల నల్లనఁ జనఁగనిమ్ము. (విరాట 5-16) మన సంవాదంబెవ్వరు, వినిరి నియతి నజ్జనులకు విభవముగల్గు (అను 2-28)

**లాట్టునకుంగొన్నియెడల లిట్టు గానంబడియెడి. 63**

పరిహారము సేసితదియేల యవగుణమయ్యెన్. (అను 2-216) నెయ్యము సెడినను మాటలఁ, దియ్యఁదనముపట్టి పగ మదిన్ మఱచినఁ జా, వయ్యెంజేటయ్యెఁ గలఁక, యయ్యె నొకటి మూఁడుఁ గాక యదిమేలగునే? (శాంతి 3-256)

**ఉపకృతి పరిణతి సంవృతి భేదంబుచే సంస్కృతసమ ధాతువులు త్రివిధంబులగు. 64**

ఇయ్యది చింతామణి మతంబు. చూ. మీఁదు.

**ఉపకృతులు పుషణ్యాదులు. 65**

ఇయ్యవి కృదంత తుల్యంబులయియుండు. లఘూపధంబునకు గుణంబు లగునవియు, క్తిన్ ప్రత్యయాద్యంతంబులగునామధాతువులు, నుపకృతులని తాత్పర్యము: పోష, ఛేద భేద, ఘోష, వర్ష, హర్ష, నుతి-ఇత్యాదులు.

**పరిణతులు భూజ్యాదులు. 66**

అయాద్యంతంబులుగఁ బరిణమించు ధాతువులు పరిణతులని భావము. భూ, జి, నీ, ద్రు, దృ, తృా, వే – ఇత్యాదులు.

**సంవృతులు రంజివస్యాదులు 67**

వికృతింబొరయక యుపదేశకాలంబునందలి యాకృతితోడన నిల్చుధాతువులు సంవృతులు : రంజ్, వస్, పచ్, త్యజ్, భజ్, ఇత్యాదులు.

ఈ త్రివిధ ధాతువులకు నించుక్కగుననుట స్పష్టంబు.

**ధాతువులకు యథాప్రసిద్ధి నిందు యోగంబు గ్రాహ్యంబు. 68**

ఇటనుటంజేసి సుప్రభృతుల కిందుఁ బ్రయోగంబులేదు.

**ఇదిత్తులగు ధాతువులు ప్రయోగానుసారంబుగ నుపకృతులగు. 69**

ఖడి, కపి, చుబి, లబి, జృభి, రభి, స్తభి, క్రది, భజి, చితి, పచి, డబి, మత్రి, కాక్షి - లోనగునవి యిదిత్తులగు ధాతువులు. వీనికి "ఇదితో నుమ్ ధాతోః" అను సూత్రంబుచే నుమ్ముగలిగి యుపకృతి ధాతువులేర్పడు. ఖండ్, కంప్ - ఇత్యాది. ఇంచుక్కు: ఖండించు, కంపించు, చుంబించు, అవలంబించు, జృంభించు, ఆరంభించు, స్తంభించు, ఆక్రందించు, భంజించు, చింతించు, ప్రపంచించు, విడంబించు, మంత్రించు, కాంక్షించు,

**ఆత్మార్థం బభిహితం బగుచోఁ దత్సంఖ్యాభిధాయి వచనంబు ధాతువున కొకానొకచోఁ గానంబడదు. 70**

తానుఁదమ్ములు నిజనివాసంబునకుంజనిరి (ఉద్యో 3-130) తానుం బతియున్ మనమున నలిగొలిలెలుఁగక, యనితరసులభైక సుఖములందుదు రనుచున్ (పారిజా 5-62) సఖీజనంబును దానుఁ దద్భేకంబునకు భార్యలైరి. (పాండు 5-311)

**ఒకానొకచో నుజ్యంతంబులు పెక్కులొక్కకార్థకంబుతో నన్వయించెడి. 71**

ఫలమునొందఁజేయఁదొలఁగఁద్రోయఁగోరి (పాండు 3-176) చెన్నమెఱయ... సహోదరతఁజూప ... బలిమిగొనఁగ ... అగడుపఱుపఁగోరి (పారిజా 1-17)

**పెక్కునుజ్యంతంబులకుఁ గొండొకచో నొక్కవలయ్యాది క్రియతో నన్వయంబు చూపట్టెడి. 72**

అగ్నిశిఖయుఁబోలెఁ నంటనుడాయను జూడరానియట్టి శుభచరిత్ర (ఆరణ్య 2-91) ధనముగలిగిన జంగమార్చన మొనర్పు. శివునకఖిలోపచారముల్ సేయవచ్చు (కాలహ 4-35)

**వలయ్యాది క్రియాయోగంబు లేకయ యొకానొకచో భావంబున నుజిగానం బడియెడి. 73**

చేయఁబాడిరే (సభా 2-10)

వలయుక్రియకుం గర్తయగు ప్రోచుధాతువునకు నుజిపరంబగునపుడు చులోపంబొకానొకచోఁ గానంబడియెడి. 74

ప్రోవలె (యు 2-115 = ప్రోవవలె)

కొన్నియెడల వాక్యాన్వయంబున భిన్నవాక్యకల్పనంబు గ్రాహ్యంబు. 75

మహద్బహు కర్తృకక్రియ కేకవచన విధానము ప్రామాదికంబని తోఁచుచుండు నది.

బలముగలవాఁడుఁ దేజము, గలవాఁడును నధికసేనగలవాఁడును భూతల మున రాజను నామము, విలసిల్లఁగఁ దాల్చు మూఁడు విధముల పేర్మిన్. (ఆది. 6-47) తన యెఱిఁగిన యర్థంబొరుఁ, డనఘా! యిదియెట్లు సెప్పుమని యడిగినఁ జెప్పనివాఁడును సత్యముఁజెప్పనివాఁడును ఘోర నరకపంకమునఁ బడున్. (ఆది 1-137)

కొన్నియెడల నుశబ్దంబు పూర్వ విరుద్ధోత్తరార్థకంబగు; నగుచోఁ బూర్వ పదంబధ్యాహార్యంబగు. 76

సంగరహితం, బైయుం నిహితులయ్యుఁ గారసురవరుల్ (ఆది 3-101) తలకు వచ్చియుఁ గాదు, సరి గాకున్న జఘున మభి మముగన్ (పాండు 2-34) గాదుఁజోడయ్యుఁ గాదు. (విక్రమా 4-19) యయ్యుఁగాదు, ప్రతివచ్చియును

కన్వాదియోగంబునం బ్రయోజ్యకర్తకు ద్వితీయయు నగు. 77

అత్తఱిలేచివచ్చి తనయన్నలఁ దమ్ములఁ గానుపించెన, య్యుత్తరు నర్జునుండు. (విరాట 5-342) వానిందోడ్కొని చని యా, భూనాథునిఁ గానుపించి, (ఆరణ్య 7-2) ఆసమయమునఁ గుమారిం, గైసేసి తదీయజననిఁ గానిపించి (విక్రమా 4-192)

ఇది క్రియా పరిచ్ఛేదము

# ముక్తలక్షణకౌముది

## కృదంత పరిచ్ఛేదము

అటివర్ణకంబోమునకగు. 1

ఓము .... ఓమటి

రాయున కడి వర్ణకంబునగు. 2

రాయు .... రాయడి (ఉ.రా. 2-19)

అలివర్ణకంబు కూడులోనగువానికగు. 3

కూడు ... కూడలి; పొంగు .... పొంగలి

పొంగున కరవర్ణకంబునగు. 4

పొంగు — పొంగరము

అసవర్ణకంబు వ్రాయునకగు. 5

వ్రాయు .... వ్రాయసము (పాండు 1-71;81; జై. భా. 8-82)

ఇకివర్ణకంబు పరంబగునపుడుండునకు నునుధాతువగు. 6

ఉండు .... ఉనికి

ఇతవర్ణకంబు పొగడునకగు. 7

పొగడు .... పొగడిత

దోఁకున కిసవర్ణకంబగు. 8

దోఁకు ....దోఁకిస

విడుచునకు గర, మర వర్ణకంబులు పర్యాయంబున నగు. 9

విడుచు .... విడుగర, విడుమర. ఇట మకార పరకత్వంబున నంతిమాక్షర లోపంబు

టవర్ణకంబు నిండునకగు; నగుచో డువర్ణకంబునకు లోపంబేని టకారాదేశంబేనగు. 10

పెన్నింటన్ (హరి. ఉ. 6-27) నిట్ట (విరాట 2-130; ద్రో 3-107 (పండితా 252 పు.-నూ. ము)

దలవర్ణకంబు కూడులోనగువానికగు. 11

కూడు .... కూడుదల. కూడు., తగులు, తాఁకు, తీఱు, మించు - ఇత్యాదులు కూడులోనగునవి.

విడియునకు దివర్ణంబగు, నగుచో సంతిమాక్షరలోపంబగు. 12

విడియు .... విడిది.

పిడి వర్ణకంబు దోఁచు నులుచుల కగు. 13

దోఁచు .... దోఁపిడి; నులుచు .... నులిపిడి.

తెగ్వాదులకు వ వర్ణకంబగు 14

తెగు ... తెగువ; నిలుచు .... నిలువ: పొడుచు .... పొడువ; పొలుచు పొలువ; విలుచు .... విలువ; గెలుచు .... గెలువము. ఇత్యాదులు.

తెలియు తాలుచులకు వువర్ణకంబునగు. 15

తెలియు .... తెలివు (ఆది 3-27; 7-73; కర్ణ 3-292) తాలుచు .... తాలువు (పండితా 88 పు - నూ. ము)

కలఁగు నిలుచులకు వర వర్ణకంబగు. 6

కలఁగు .... కలవరము; నిలుచు .... నిలువరము.

సొగయు బిగియు బిఱ్ఱులకు సు వర్ణకంబగు; నగుచో నిత్వంబున కుత్వంబును; రేఫంబున కొక్కటికి లోపంబునగు. 17

సొగయు .... సొగసు; పులియు .... పులుసు; బిఱ్ఱు .... బిఱుసు ఇత్యాదులు మహాజన వ్యవహారంబుల నెఱుంగునది.

ఇది కృదంతపరిచ్ఛేదము

# ముక్తలక్షణకౌముది

## ప్రకీర్ణక పరిచ్ఛేదము

పదాంతంబులయి యసంయుక్తంబులయిన నులుదు వర్ణేతరంబుల యుత్వంబునకును లోపంబు బహుళంబుగ నగు. 1

కీడ్వడు (ఆది 5-164; స్త్రీ 2-58) గిడ్డురుతల్పగుండు. (శాంతి 1-307) ఏడ్దినంబులు (బసవ 373 పు) గుంద్రా. (మను 5-17) త్రాడ్వేసు (పండితా. పురాతన 359 పు) ఎట్రా. (జై. భా. 7-92) పన్నొకండు. (వరాహ 9-84) పద్మూఁడవ (భోజరా 7 ఆ) పద్నాలుగు (అప్పక 4-490) పక్షంబున – కీడువడు నిత్యాది ఇక్కార్యంబు సంయుక్తంబునకుఁ గొండొకచోఁ గానంబడియెడి. గట్టురామాలి, గట్రామాలి (జై. భా. 7-92)

కొండొకచో నుత్వభిన్న స్వరంబునకును లోపంబుగానంబడియెడి. 2

అట్రా (జై. భా. 7-92: శివిక 4-152) కాట్రేడు [కాలహ 3-38] అయ్యున్ (ఉద్యో 2-272) ప్రయ్యున్ (మాసల 170 ప) రాత్రేక (శివరా 2-79; కాశీ 3-240) వెర్నీరు (పాండు 3-56 వెటి+నీరు)

నకారంబు నుత్త్వేతర స్వరంబునకుం గొన్నియెడల లోపంబు చూపట్టెడి. 3

ఎన్దలల్ (ఉ. హ. 5-87. ఎని+తలల్) కొన్గినిసి (పాండు 4-147 కొని+కినిసి)

సంశ్లిష్టబహువచనాంతంబుల తుదియుత్వంబునకు హల్లుపరంబగునపుడు గొండొకచో లోపంబు గానంబడియెడి. 4

గ్రుక్కిట్ర్మింగుచు (కాశీ 4-123. గ్రుక్కిళ్లు+మ్రింగుచు) వసివాళ్వాడుచు (క్రీడా 86 ప. వసి వాళ్లు+వాడుచు) నీరు కోళ్కొలకొల (ఆముక్త 1-71 నీరు కోళ్లు+కొలకొల) ఎన్నిమార్ల్గాము (ఆముక్త 6-61 ఎన్నిమార్లు+కాము)

ఉప్రాద్యంబులకు రడలకుఁ బదమధ్యగంబుల కొకానొకచో నలఘు లకారంబు విభాషనగు. 5

మరలు ... మళ్లు (భాగ 6-247; ఆం. భా. 3-114) వెడలు ... వెళ్లు (వరాహ 1-6; కళా 3-91) సడలు ... సళ్లు (పాండు 2-11; ప్రబంధ 1-675)

ఒడలు ... ఒళ్లు (కవిక 3 ఆ - 88.) ఒళ్లు శబ్దం బౌపవిభక్తికంబు. ఒంటిజందెము (పాండు 3-10) కల్యకచ్చువంటి రొయింట్టివాని (పాండు 5-197)

అచ్ఛికంబులం బదమధ్యంబుల నలర రేతరంబుల యుత్వంబునకును లోపంబు బహుళంబుగానగు. 6

చదువు. చద్వు, (పండితా 2 భా. 365 పు) కాయువు, కాయ్వు (విరాట 2-310)

లాఁతియచ్చునకు సహితముగొండొకచో లోపంబు బహుళంబుగానగు. 7

ఎయిదు, ఎయ్దు [ద్రోణ 2-247] చెయిది, చెయ్ది [స్త్రీ 2-121] చెయిదము, చెయ్దము [హరి. పూ. 9-55; బసవ. 500 పు] చెయివు, చెయ్వు (ఆది 8-21) మాదిరి, మాద్రి (వర్గాహ 12-9; పాండు 1-3,41) మాసటీఁడు. మాస్టీఁడు (రామా 8-91; హ. న) తంతరము, తంత్రము, మంతరము, మంత్రము [సంజ్ఞా 23] రాతిరి = రాత్రి (పండితా 253 సూ-ము)

ఒకానొకచో యువర్ణాంత ధాతువుల యుపోత్తమేత్త్వంబునకు లోపంబుగానంబడియెడి. 8

కురియు = కుర్యు [హర. 2-22; బసవ 288 పు] తివియు = తివ్యు (బసవ 418 పు)

అచ్ఛిక పదంబులందు స్వరభేదంబునగు రూపాంతరంబులు యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులగు. 9

కానిక (కాశీ 7-152; శృ. నై. 8-33) కానుక (రామా 7-162) కైదువు (మను 4-105) కయిదువ (కాలహ 2-26); కోరిక (పారిజా 5-24) కోరికి (వసు 3-47) కోరిక (తపతీ 1-7) గొౘ్చు, గొట్టి (య. 2-32) చిగురు, చిగిరు; (విజయ 1-210) టెక్కెము, టక్కెము (క్రీడా 263 ప) దీవన (అశ్వ 3-103) దీవెన (అచ్చ. రా. యు 406; నమలి (భీమ 3-28) నెమలి [భాను 4-75 సూ.ని.] నెమిలి (కై. భా. 4-79) మనుమరాలు, మనమరాలు (వసు 5-35); మురిపము (ద్వి 1 భా 4-228) మురిపెము (శృ. శా 2-483) మూఁపురము, మూఁపరము; (భాగ 3-414 మెలుఁత (అను 3-221; పండితా 281 పు) మెలఁత; వదినె, వదిన. (విక్ర 8-93] సడలు, సడిలు (కాలహ 4-12) ఇత్యాదులు.

ఉపపరక రవర్ణ యుక్పరకరువర్ణంబుల ముందటిదగు వర్ణంబుల యుత్వంబునకుఁ గొన్నియెడల లోపంబు విభాషనగు; నగుచోఁ దత్పూర్వ స్వరంబులు గురువులుగావు. 10

చిద్రుపలు (ఉ.హ 4-109) ఇగ్రుచు (శివరా 2-39; కాశీ 7-246; కవిక 3-222 చూ. తద్ధిత 14)

అచ్ఛికంబులంబడమధ్యంబులఁ గొండొకచో శ్వాసవర్ణపరకత్వంబున దకారంబు తకారం బొందెనగు. 11

పిదుకు (మను 2-11) పితుకు (హరి.పూ. 1-131) బ్రదుకు (ఉద్యో 1-348) బ్రతుకు (నీలా 3-24) మెదుకు (పాండు 4-215) మెతుకు (విజ్ఞా 1-68; ఆం. భా 2-257) శ్వాసవర్ణపరకత్వంబున ననుటంజేసి నాదవర్ణపరకత్వంబునంగాదు. ఒదుగు, మదుగు, అదను, పదను, అదరు, బెదరు, కదలు, మెదలు-ఇత్యాది.

తటలులోనగువాని వినిమయంబు ప్రయోగంబులవలనఁ దెలియునది. తక్కరి (నిరం4-18) టక్కరి; వెడలు, వెలలు; అరఁటి; అనఁటి; పల్లు, పన్ను. (చంద్రా 5-85) సంబళము, సంబడము; మామిడి, మావిడి - ఇత్యాదులు.

మ్రాన్వాదుల క్రాముడికి లోపంబు విభాషనగు. 12

ముసలిమానుల్, (వసు 1-44) ముసలిమ్రానుల్ (ఁకుల్) తెడ్డు (భీమ 2-97) త్రెడ్డు (భీమ 2-115) ఇట్టివి సాధుకవి ప్రయోగారూఢంబులు గ్రాహ్యంబులు.

అకారైకారంబు లవధారణార్థకంబులు. 13

వీని నేవార్థకంబులనియు వ్యవహరింతురు. పర్వంబ [ఆది 1-58) డాయంగఁ జనునప్పుడ (మను 3-19) ఇంతేపో (ఉద్యో 1-321) అతనికతండెసాటి (విజయ 1-93)

అర్థదార్ఢ్యంబునఁ గొండొకచో నవధారణార్థకంబుమీఁద నవధారణార్థ కంబు గానంబడియెడి. 14

అట్టిదయ (ఉద్యో 2-197 అట్టిద + అ) తత్త్వామృతంబయ (బసవ 19పు అమృతంబ + అ) కల్మినయ (పాండు 1-206 కల్మిన + అ) ఇంతియే (ప్రబోధ 4-46)

**లోకోక్తులు లోనగునవి యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులగు. 15**

ఇటనుటంజేసి లోకోక్తులు లోనగువాని ప్రయోగమున గ్రామ్యతా దోషంబు లేదని యెఱుంగవలయును.

రోళ్ళ, రోకండ్లంబాడిన కూరుములు (ప్రభావ 5-25) కసుఁగొన రోళ్ల రోకళ్ళఁబాడెదరు (బసవ 290 పు) నుయిద్రాఁచువానికిం జింతయా, కంత్రైనం గడమేనియుం గడమకాదా! (పాండు 4-275) గుడిమ్రింగేవానికిం దల్పు లప్పడ మూల్ (రుక్మాం) గుడిమ్రింగువానికిఁ దలుపు లప్పడములు గాకుండునే? (పాండు 5-229) అందఱకుం దలాయొకటి స్వార్థము గల్గుట (ప్రభావ 4-90) నరపతి నమ్మి నమ్మక వనిగొనునది. (శాంతి 2-351) నిజమిత దుందుభిధ్వని వినీవినమిన్ (జై.భా 4-116) మానిచంద్ర! యింకా విన నెమ్మదిన్ మిగులఁ శాతుకమయ్యెడు (ఘటికా 1-87) ఇత్యాదులు ప్రయోగంబులవలనం దెలియునది.

**సంజ్ఞావాచకాదులకు సంస్కృతీకరణంబు ప్రయోగ సమ్మతంబు. 16**

క్షీరాంభోధి (కాశీ 1-52 = చిలుకసముద్రము. ఇయ్యది సరోవరనామంబు) సలిల కాషాయ వస్త్రము (కాశీ 7-187 = నీర్కావి) షట్సహస్రాన్వయేశా (పాండు 5-327 షట్సహస్రాన్వయము = ఆఱువేల నియోగివంశము) ఏకశిలాభిధానమున నెన్నికకెక్కి ధరిత్రిలోన నే, పోకలఁబోని యట్టి సిరిపుట్టినయింటికి నోరుగంటికిన్ (ద్వా. 8-156)

**అ ఇ ఉ లు గొండొకచో లోకప్రసిద్ధ వ్యావహారిక స్త్రీ నామంబులకగునంద్రు. 17**

లచ్చ, లచ్చి, లచ్చు; గౌర, గౌరి, గౌరు (అహో 477)

**యతిప్రాస శబ్దాలంకార నిర్వహణమునం గొన్నియెడల శిష్టోచ్చారణంబు పరిగ్రాహ్యంబు. 18**

అజ్ఞానికి నుపదేశవిధిఁ బ్రకాశము సేయన్ (శాంతి 4-255) అజ్ఞానమనియెడు నంధకారమున, మగ్నుఁడనై (సోమనా) ఉదంచ, త్వరతర జిహ్వ్వనకు నుగ్రతర రంహులనకున్ (భాగ 7-294) గహ్వరాంతరముల సింహమధ్య (హరిశ్చంద్రో)

అ ఇ ఉ లు, హ్రస్వవక్రంబులు తద్విశిష్టంబులు కగచ తదన పదమ వసలు, ననువర్ణంబులమీఁద లఘ్వలఘు రేఫంబులు రెండు నగు. 19

లఘురేఫమునకు : అరిది (ఆది 1-106) అరయు (ఆది 1-26) ఇరువురు (ఆది 2-10) = ఊరార్చు (ఆరణ్య 3-160) ఒరులు (ఆది 1-160) కరము (ఆది 1-120 = అత్యంతము) కారించు (ఆది 5-166) గారవము (ఆది 7-87) అచ్చెరువు (ఆది 1-156) తెరలు (ఆది 7-112) దొర (ఆది 6-45 = సాటి) నర (ఆది 3-194) దెప్పరము (సభా 2-255) మీరలు (ఆది 2-147) వరపుడు (సభా 2-200) నూరెలు (ఆది 2-199) అలఘురేఫమునకు; అఱకడ (ఆది 6-115) ఆఱు (ఆది 4-19 = ఉపశమిల్లు) ఎఱుక (ఆది 3-12) ఒఱపు (అరణ్య 2-135) ఒక్కఱు (ఆది 5-256) గిఱుపు (ఆది 5-164) చఱచు (ఆది 2-79) తఱసలి (సభా 2-228) అందోఱు (ఆది 5-164) నెఱిఁకులు (ఆది 4-203) పఱపు (ఆది 7-226 మఱకువ, (ఆరణ్య 1-326) వెఱచు (ఆది 1-147)
బసలమీఁద లఘురేఫంబ వాగనుశాసనుల ప్రయోగంబుల గానంబడియెడి.

బోరన (ఆది 2-39) బోరు (ఆది 2-100) సరి (సభా 1-60) సిరి (ఆరణ్య 2-111) నూరెలు (ఆది 2-199) సెరగు (ఆది 8-119)-వై.పా. అలఘురేఫమునకు- బఱివోపు ( క్రీడా 168 ప) బిఱు బిఱ్ఱు (ఆముక్త 6-74) బీఱువాఱు (అశ్వ 1-108) సుఱి సుఱి (ఆముక్త 5-123)

లాఁతివర్ణంబులమీఁద లఘురేఫంబయగు. 20

ఏ ఓలకు — చేరు (ఆది 2-103) తేరన్ (అరణ్య 3-76) కోరు (ఆది 3-200) పోరచి (ఆది 5-129) పోరు (ఆది 3-103) ఇతరహల్లులకు — పుట్టిరి ఆది 3-81) ఒండొరు (ఆది 4-194) అయ్యెర (ఆది 1-153) రానేరరు (ఆది 5-68) - వై.పా.

ఈనియమంబునకుఁ గొన్నియెడల నన్నయేతర కవుల ప్రయోగంబులందు వ్యతిక్రమంబు చూపట్టెడు :

ఏఱుకొనివత్తు రాఁకలి డీఱకుండు (అశ్వ 4-220) చేఱుకోల (ద్రోణ 3-18) తేఱు (కు.సం. 6-114 ; హ.రి. ఉ. 7-182) కోఱడము (నిర్వ 5-77) గోఱజము (మను 4-14) జాఱు (ఉ. హ. 6-138)

సంయుక్తాక్షర ఘటితంబులు లఘురేఫంబులును, ద్విత్వాక్షర ఘటితంబు లలఘురేఫంబులు నగు. 21

అ్రదుచు; చి్రదుపలు; వ్రట్టువ; అఱ్ఱు, గొఱ్ఱియ.

జడ్డలోపంబున నలఘురేఫంబు తొంటియట్ల యగు. 22

అఱు, గొఱియ.

శాఖి శైలాగ్నివాచకాదులు లఘురేఫ ఘటితంబులని కొందఱం్రడు. 23

ఖగతి బర్హి రంతరిక్ష వాచకంబులు, సదృశ బిందు శిలీముఖవాచకంబులు నాదిపద గ్రాహ్యంబులు.

శాఖి :- ఉసిరిక. నారికెడము, రావి, నేరేడు; శైల :- తరిగొండ, బంగరు గట్టు, అగ్ని :- ఎరగలి, వైరవులు, ఎరియు, దరికొను; ఖగతి :- ఇది తిర్యక్కులకు నుపలక్షణము. ఊసరవెల్లి, పూరేడు, తగరు, గొరు: బరివా :- పూరి, పొరక, వరి, అగురు, పెసర, గరిజేరు, నల్లేరు; అంతరిక్ష: - ఉప్పరము; సదృశ:- సరి, దొర, కరణి, మాదిరి, పురుడు; బిందు :- అరసున్న; శిలీముఖ :- జిరా, లకోరి, బరి గోల, నారసము. ఇట్లు కొన్నింట గ్రహించునది (వై.పా. 468-475; వ్యా సం. స. 144-146పు)

హర్యంఘ్రి ఖశరవాచకంబు లలఘురేఫ ఘటితంబులని కొంద ఱం్రడు. 24

హరి :- తెఱనోటిమెకము. అంఘ్రి :- అఱకాలు; ఖ:- అఱసున్న, నెఱి సున్న, శర:- ఱెల్లు.

అనిర్ణేయంబులు గ్రామమానుష నామంబులు రేఫమాత్రైక గోచ రంబులు. 25

వంతరాము, కొరటాము; రేచడు-ఇత్యాదులు.

కొన్నిబహువచన ప్రత్యయాంతంబులు లఘు రేఫాన్వితంబులుగను గొన్ని యలఘురేఫాన్వితంబులుగను జూపట్టెడు. 26

లఘురేఫమునకు :- చనిరి, కాంచితిరి, చేకొనియెదరు (అర్థక) వారు, వీరు, మీరు, తారు, ఎల్లరు, పలువురు, బాలురు, అలఘురేఫమునకు :- కాప్రత్యయాంత

ములు - విలుకాఱు, వేఁటకాఱు; చెయివు బహువచనరూపము — చెయివుఱు; అంతాదుల మహద్బహువచనములు : అందఱు, ఇందఱు, కొందఱు.

ప్రేరణరూపంబులు గొన్నిలఘురేఫఘటితంబులు గొన్ని యలఘురేఫఘటితంబులు నగు. 27

ఆరుచు, ఓరుచు, కూరుచు.

చేఱుచు, చెఱుపు, పఱుచు. వెలువఱుచు, వెలువరించు, చొప్పఱుచు, చొప్పరించు, నిలువరించు, మోఁకరించు - ఇత్యాది.

త్రిలఘు క్రియాపదాంత్యంబు తఱుచుగ లఘురేఫంబగు. 28

తనరె, పొనరె, అడరె, అలరె, గదిరె, అదరె, బెదరె, (ద్విరే-వై.పా. 420 పు)

లఘ్వలఘురేఫంబులను మైత్రిం బొరయు. 29

అనురక్తి ఱేఁచునూతన సారసాటోపము (హ.వ.2-30. ఱేఁచు = ఱేఁచుకు. రేఁచు = రేఁగించు) రఱలయతిప్రాసమైత్రియుగ్రాహ్యంబని యొఱుంగునది.

అడ్వంతంబులు, నుమ్వంతంబులు, పువర్ణాంతంబులు నలఘురేఫాన్వితంబులగు నండ్రు. 30

అడ్వంతంబులు- కొఱడు, పొఱడు, పోఱడు, వఱడు. ఉమ్వంతంబులు - నఱుము, నుఱుము, ఉఱుము, అఱుము; పువర్ణాంతంబులు - మెఱపు, ఒఱపు, చెఱపు; పఱుపు ఎఱుపు, (శకటరే - వై.పా. 422 పు)

మహాకవి ప్రయోగంబులు సర్వథా సాధువులనియుఁ దదన్యంబు లవిరుద్ధంబులు సాధువులనియు గ్రహించుట శ్రేయంబు. 31

"శ్రీస్తనాఞ్చిత కస్తూరీ, పఙ్కసంకలితోరసే
పఙ్కజాతాలయ నాథాయ, వేంకటేశాయ మఙ్గళమ్."

ఇది ప్రకీర్ణక పరిచ్ఛేదము

"అహంచభాష్యకారశ్చ, కుశాగ్రీయధియావుభౌ
నైవ శబ్దాంబుధేః పారం, కిమన్యేజడబుద్ధయః".

ముక్తలక్షణకౌముది సంపూర్ణము

# మార్పులు - చేర్పులు

## మార్పులు

సంధి 1 సూ :- ఈ సూత్రమును గ్రిందిరీతిని గ్రహింపవలెను.

"సంధిలేనిచోట స్వరంబుకంటెం బరంబయిన స్వరంబునకను కరణంబు.ఁ బ్రకృతి భావంబగు."

సంధి 38 సూ :- వయ(శ్రీ)చన - అనులక్ష్యమును, "నగరి పురమతల్లి" అనుదాని తరువాతఁ జేర్చి చదువుకొనవలెను. తక్కినచోట్లఁ ద్యాజ్యము.
తత్సమ 21 సూ :- ఈ సూత్రమును క్రిందిరీతిని గ్రహింపవలెను.

"మాంధాతృశబ్దంబునకును, నత్వ స్త్రీవద్భావంబులు విభాష నగు." ఇట అభియాత్ఱుఁడు (భాగ) అభియాత - అనునది త్యాజ్యము.
తత్సమ 57 సూ :- ఇట ఇంద్రజిత్తునినిన్ - అనునది త్యాజ్యము.

కారక 7 సూ :- "ఈ షష్ఠి స్థలాంతరంబు నందును గానంబడియెడి" ఇత్యాదిగానున్న భాగమంతయుఁ ద్యాజ్యము.

## చేర్పులు

సంధి 30 సూ :- ఇటఁ గ్రింది లక్ష్యమును జేర్పవలెను.

"విశ్వామిత్రమౌ ... ఈశబుద్ధిః విశ్వామిత్రమౌనీశబుద్ధి"
(రాఘవ 2-7)

క్రియా 46 సూ :- ఇటఁ గ్రింది వృత్తిని జేర్పవలెను.

"చేతురు కోతురిత్యాదులును, సాధువులని యెఱుఁగునది. చేతువు (వరాహ 6-124) చేతునో (విక 3-55) చేతురె (నిరం 2-30) చేతురు (ఉ.రా 6-217) నుతిసేతు (లంకా) ఏమిసేతు (భోజరా 4ఆ) సికమొదలంటఁగోతు (తెనాలి-చాటువు)

క్రి సూ 1 :- నుజ్యంతంబు మీఁది యుండు ధాతు భవచ్ఛత్రర్థం బొకానొకచో భావ్యర్థకంబగు.

సూ 28 :- ఇచ్ఛకించుక్కు పరంబగునపుడయు గాగమంబు వైకల్పికంబుగనగు

# తప్పొప్పుల పట్టిక

| పుట | సూత్రసంఖ్య | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 1 | 3 | 4 | 31-111 | 2-84 |
| 2 | 5 | 8 | 6-64 | 6-161 |
| 2 | 5 | 12 | త్రప | తప్త |
| 3 | 8 | 5 | మజ్జె | మజ్జ |
| 4 | 11 | 1 | నేకు | నేను |
| 5 | 16 | 4 | 1-53 | 1-52 |
| 6 | 21 | 9 | శ్రయ్యా | శయ్యా |
| 9 | 25 | చివరిది | జెగజ్జ్వోతి | జెగజ్జ్యోతి |
| 19 | 19 | 4 | కొలిచితన్, | కొలిచితిన్ |
| ,, | ,, | ,, | కొలిచితిబ్ధిజన్ | కొలిచితబ్ధిజన్ |
| 19 | 20 | 9 | 4-58 | 2-51 |
| 20 | 22 | 1 | పరుషముకు | పరుషములకు |
| 23 | 32 | 1 | శేంషబు | శేషంబు |
| 30 | 53 | 4 | సరద్వా | సర్వదా |
| 32 | 3 | 4 | అపానుఁడు | అపానుఁడు |
| 33 | 7 | 1 | జవ | జన |
| 34 | 14 | 1 | కర్ణకంబు | వర్ణకంబు |
| ,, | ,, | 3 | క్రింబున | క్రియుంబున |
| ,, | 17 | 3 | ములల్లుల | మల్లుల |
| ,, | 18 | 2 | వైకల్పికబుంన్ | వైకల్పికంబుగ |

Scanned by TapScanner

| పుట | సూత్రసంఖ్య | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 35 | 22 | 3 | పద్యము | సద్యము |
| ,, | ,, | 4 | వరము | పరము |
| ,, | 24 | 2 | 41-64 | 4-164 |
| 37 | 33 | 1 | నందుచు | నందును |
| 37 | 34 | 1 | బాహు | బహు |
| 38 | 37 | 4 | విభ్యుఁడు | సభ్యుఁడు |
| | 40 | 3 | ప్రభువిష్ణుఁడు | ప్రభవిష్ణుఁడు |
| 39 | 42 | 1 | త్త్వంబు | త్వంబు |
| 40 | 42 | 5 | 5-10 | [illegible]-110 |
| | 43 | 1 | వచనలు | వచన |
| 41 | 44 | 15 | విక్ర | విక్ర 4-35 |
| 42 | 44 | 12 | 3-38 | 3-138 |
| | 45 | 2 | సామర్థ్యంబు | సామర్థ్యంబున |
| | 45 | 6 | అస్త్ర | అశ్వ |
| 43 | 52 | 3 | శసదృశ | దృశసదృశ |
| 46 | 1 | 7 | బగతుఁడు | బగుతుఁడు |
| | 3 | 4 | తాళములం | తావళములు |
| | 4 | 1 | గ్లిబసస | గ్లిబస |
| 47 | 10 | 2 | 1-132 | 1-130 |
| 48 | 13 | 2 | మతాంగ | మంతాగ |
| 49 | 13 | 3 | నోళ్లులు | నోళులు |

| పుట | సూత్రసంఖ్య | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 50 | 31 | 1 | వకారంబునకు | నకారంబునకు |
| 56 | 20 | 4 | పుప్కరా | పుష్కరా |
| | 22 | 1 | ఆధ్వ | అధ్వ |
| 58 | 33 | 1 | మహాధా | మహాదా |
| 62 | 12 | 4 | పాకృ | కృపా |
| 63 | 15 | 4 | ప్రతిజోడు | ప్రతిజోదు |
| 65 | 27 | 3 | 2-72 | 2-172 |
| 65 | 28 | 5 | బంధు | బంధుల |
| 66 | 32 | 5 | 6-1 | 6-11 |
| 67 | 37 | 5 | దితగోరు | దివగోరు |
| 78 | 13 | 8 | జోచిగి | జోచ్చి |
| 79 | 18 | 4 | ఆన్ | అన్ |
| 82 | 36 | 3 | 4-58 | 2-51 |
| 88 | 1 | 1 | క్వార్థ | క్వార్థ |
| 89 | 76 | 4 | మభిమము | మభిరామము |
| 91 | 10 | 1 | దువర్ణకంబు | దువర్ణంబు |
| | 12 | 1 | దివర్ణ | దివర్ణక |
| 92 | 4 | 5 | మార్గాము | మార్గాము |
| 95 | 15 | 5 | రోకళ్ళ | రోకల్ల |
| | 15 | 10 | శాతుక | గాతుక |
| 97 | 23 | 6 | బరివా | బర్హి |